

కేసరి హైస్కూలు వార్షిక ఆటలు, సారస్వత పోటీలలో గెలు
పొందిన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టిన నాటి దృశ్య
ములు. చిత్రములలో రాజా యం. విజయఅప్పారావు గారు
శ్రీమతి శివభోగంగారలను చూడనగును.






అతడు వట్టి కూలిపనివాడే కాదు. ఇప్పుడతడు నిర్మాణానికి సాయపడుతూన్న పెద్ద నీటి పారుదల ప్రాజెక్టుకు ఏబదిమైళ్ల దూరంలోనే ఉన్న అతని స్వగ్రామంలో అతనికి 5 ఎకరాల భూమి ఉన్నది. ఇక మీదట అతనికి మంచి భవిష్యత్తు కలదు. ఇప్పుడు రెండేళ్లుగా అతడు ఆనకట్టమీద పనిచేస్తున్నాడు. ఆ బృహద్యోజన అతని కళ్ల యెదుటనే పూర్తి కావస్తున్నది—అతని కల నిజమౌతూ ఉంది. ఇంకేమి, అతడు తన గ్రామానికి మళ్లి, తనకు కావలసినవన్నీ పంట చేసుకుంటాడు. తన భూసాయంవల్ల వచ్చు లాభానికి తోడుగా, అతడొక చిన్న గృహపరిశ్రమను సయితం స్థాపించవచ్చు.

భారతదేశమంతటా ఇంకా ఎన్నెన్నో నదీలోయ ప్రాజెక్టులు నిర్మాణమవుతున్నాయి. ఇంకా ఎంతో భూమికి నీటి పారుదల ఏర్పాట్లు జరుగుతాయి. పరిశ్రమయంత్రాల్ని నడపడానికి అవసరమైన విద్యుచ్ఛక్తి తక్కువ ఖర్చులో లభించగలదు. నదీ ప్రవాహాలవల్ల ప్రాణనష్టంకాని, ఆస్తి నష్టంకాని జరుగక, ప్రజాజీవనం సుక్షేమంగా, సుభిక్షంగా ఉంటుంది. కాని, ఇవన్నిటికీ డబ్బు కావాలి. ఎంతో డబ్బు కావాలి.

నేషనల్ ప్లాన్ సేవింగ్స్ సర్టిఫికేట్లలో గాని, ప్రభుత్వ హామీ గల ఇతర స్వల్ప ఆదా స్కీము సెక్యూరిటీలలో గాని పెట్టుబడి చేసిన మీ ఆదా, ఎంత స్వల్పమైనా సరే, ప్రభుత్వానికి అవసరమైన సొమ్మును సమకూర్చగలదు. ఈ మీ సొమ్మును ఇన్‌కంటాక్సు లేని వడ్డీతో సహా మీకు ఇచ్చివేస్తారు.

**12 సం॥ల నేషనల్ ప్లాన్ సేవింగ్స్ సర్టిఫికెట్లు**

* 5.41 శాతం ఇన్‌కంటాక్సు లేని సంవత్సర ప్రతి వడ్డీ.
* రూ. 5 మొదలు రూ. 5000 వరకు గల డినామినేషనులలో ఈ సర్టిఫికెట్లు అన్ని పోస్టాఫీసుల లోనూ సులభంగా దొరుకుతాయి.
* భారత ప్రభుత్వ హామీ గలదు.

స్వల్ప ఆదాల స్కీములో గల మరికొన్ని ప్రభుత్వ సెక్యూరిటీలు:

10 సం॥ల ట్రెజరీ సేవింగ్స్ డిపాజిట్ సర్టిఫికెట్లు
పోస్టాఫీసు సేవింగ్స్ బ్యాంకు డిపాజిట్లు




DA 57/283



# నేషనల్ సేవింగ్స్ ఆర్గనైజేషన్

ఇతర వివరాలను, ఈ పెట్టుబడులను గురించిన నిబంధనలను నాగపూర్‌లో గల నేషనల్ సేవింగ్స్ కమిషనర్ వద్దనుండిగాని, మీ రాష్ట్రంలో గల రీజనల్ నేషనల్ సేవింగ్స్ అధికారివద్దనుండిగాని తెలియగలరు.

# వి ష య సూ చి క





---


Statement about ownership and other particulars about newspaper GRIHALAKSHMI to be published in the first issue every year after the last day of February.

FORM IV

(See Rule 8)

1. Place of Publication ... Kesari Kuteeram Private Ltd., 15, West Cott Road, Madras-14
2. Periodicity of its publication ... Monthly
3. Printer's Name ... Dr. S. Seshagiri Rao, *for* Lodhra Press
   Nationality ... Indian-Hindu
   Address ... 15, West Cott Road, Madras-14
4. Publisher's Name ... Dr. S. Seshagiri Rao, *for* K. K. Pte. Ltd.
   Nationality ... Indian-Hindu
   Address ... 15, West Cott Road, Madras-14
5. Editor's Name ... Sri C. C. Punniah, Ag. Editor
   Nationality ... Indian-Hindu
   Address ... 15, West Cott Road, Madras-14
6. Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital ...
   1. Mrs. K. Sarada Nedungadi
   2. Dr. S. Seshagiri Rao
   3. Dr. T. M. B. Nedungadi
   4. Sri K. Radhakrishnan
   5. Mrs. K. Vasantha
   } 15, West Cott Rd. Madras-14

I, Dr. S. Seshagiri Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.) S. SESHAGIRI RAO,
*Publisher*

Date : 15–3–58

శించి కమిటీలను నియమించుటయో లేక చట్టములు చేయుటయో కంటె వాటికని కేటాయించిన మొత్తములను వారి విద్యావసతులకుగాను, వారు సంఘంలో సుచిగా శుభ్రంగానలుగురితో బాటు గౌరవంగా జీవయాత్ర సాగించుటకు వినియోగించినచో అస్పృశ్యత తనంతట తానే మరుగుపడిపోగలదు. వెనుకబడిన జాతులవారు నలుగురితో బాటు విద్యావిజ్ఞానముల నార్జించి, యితరులతో సమానంగా జీవనము చేయుటకవకాశము ఏర్పడినప్పుడు సంఘంలో తరతమ బేధములు మాయమై పోగలవు. హరిజనులైనా, తదితర వెనుకబడిన జాతులవారైనా తాము ఒక ప్రత్యేక వర్గమువారమనే భావముమాని నలుగురితో కలసిమెలసియుంటూ, ఆచారవ్యవహారాలలోనేమి, నాగరికతయందేమి, విద్యావిజ్ఞానముల ఆర్జినయందేమి నలుగురితో సమానంగానో లేక మిన్నగానో ఉండాలనే ఆసక్తితో ప్రభుత్వము సమకూరుస్తున్న అవకాశములను సద్వినియోగంచేసికొనగలగాలి. అలా చేసికొని యితరులతో తామేవిధంగాను తీసిపోవుటలేదని రుజువుచేసికొను సందర్భమున వారినడ్డగల శక్తులులేవు సరిగదా ఆటంక పరచుటకవకాశములుకూడలేవు. ఏదైనా తమకమరిన అవకాశములను గుర్తించి వానిని శ్రేయపురోభివృద్ధికి వినియోగించుకొనుటలో ఉమ్మడిసంఘములో భాగమయిననాడే అభివృద్ధి అభ్యుదయాలు త్వరితగతిన సాధింపనగును. తాము ప్రత్యేకవర్గమని తమకు ప్రత్యేకంగా హాస్టల్సు, స్కూళ్లులాంటి సంస్థలు, అవకాశములు కావలెనని ఆరాటపడుటవలన వెనుకబడిన జాతులకు బయటి సంఘముతోను దాని ప్రభావముతోను అంతగా సంబంధము లేక విద్యావిజ్ఞానములలోను, సాంఘికాచార వ్యవహారములలోను, నిత్యజీవితసరళిలోను యితర ప్రమానీకంతో సమానమనిపించుకొనుట చాలకష్టము. పాఠశాలలలోను, హాస్టల్సులోను, పఠన, ప్రార్థనామందిరాల లాంటి వానిలోగాని, సాంఘిక సంస్థలలోగాని యితర ప్రజానికంతో కలిసిమెలసి యుండటానికి వెనుకబడిన జాతులవారు తాపత్రయపడాలి. ప్రభుత్వము సయితము అట్టి విధానమునే ప్రోత్సహించుట వాంఛనీయము.

ఇలాగే మహిళాసంక్షేమము నుద్దేశించి కేటాయించబడుతున్న మొత్తములు తృప్తికరంగా సద్వినియోగంకావాలంటే మహిళాసంఘములు ప్రతియూర ఏర్పడి తమ అభ్యుదయ అభివృద్ధులకని అమరినవసతులను గుర్తించి వినియోగించుకోకలుగాలి. ఆ వినియోగమయినా విద్యావిజ్ఞానముల వ్యాప్తికి, వైద్య, ఆరోగ్యసదుపాయముల విస్తరణకు జరుగుచున్నదాయని ఆసక్తితో పారచూచుకోకలుగాలి. విని

యోగంలో నేదైనా లోపాలున్నచో సరిదిద్ది ఆ యవకాశములను తమ జీవితపురోభివృద్ధికి తోడ్పడేలాగ రూపొందించుకోవాలి.

సంక్షేమ కార్యక్రమాల పేరుతో కేటాయించిన మొత్తాలు మాత్రము కర్పూరములాగ కరిగిపోతూ అభివృద్ధి అభ్యుదయాలు మాత్రము తృప్తికరముగా లేకున్నచో, అన్ని విధాల జాతీయ శ్రేయస్సునకది నష్టదాయకమవక తప్పదు.

---

# సంతాప సానుభూతులు

నెల్లూరువాస్తవ్యులు, సుప్రసిద్ధన్యాయవాది శ్రీ చివుకుల మాలెకొండయ్యగారు యీ నెల 2-వ తేదీన మధ్యాహ్నం మద్రాసులో స్వర్గస్థులగుటమాకు అత్యంత సంతాపకారణమయినది.

శ్రీ మాలెకొండయ్యగారు ఉదారహృదయులు, బంధుప్రియులుకూడాను. వారి అభిమాన వాత్సల్యములు బంధుమిత్రులను నిరంతరము ఆనందపరచుచుండెడివి. వారి వదాన్యత, ప్రజాహితముపట్ల ఆసక్తి అనేకమందివ్యక్తులను, సంస్థలను ఉద్ధరించి, అభివృద్ధి అభ్యుదయములవైపు పురోగమింపజేసినవి.

స్వయంకృషితో న్యాయవాదిగా జీవయాత్రను మహోజ్వలంగా రూపొందించుకొనినవాడగుటచే బీదసాదలపట్ల కనికరముకలిగియుండేవారు. వృత్తిలో చిత్తశుద్ధితో కృషిచేయడంతోబాటు తన ప్రజ్ఞా విశేషములతో నెల్లూరులో ఉత్తమ న్యాయవాదిగా పేరు ప్రఖ్యాతులను గడించుకొనిరి.

శ్రీ మాలెకొండయ్యగారు కళాప్రియులు, రసికులు కూడాను. నెల్లూరు ఆంధ్రసభకు, పెర్మనెంటుఫండుకు చాలకాలము అధ్యక్షులుగానుండిరి.

శ్రీ మాలెకొండయ్యగారి నిర్యాణమువలన విచారసాగరమున మునిగియున్న వారి కుటుంబమునకు, బంధుమిత్రులకు మా సానుభూతిని తెలియజేయుచు, వారికి భగవంతుడు పరిపూర్ణమైన ఆత్మశాంతిని కలుగచేయుగాక! యని ప్రార్థించుచున్నాము.

......o......

# శాంతి సాధన

శ్రీ గాడేపల్లి శంకరం

గ్రామంలో శాంతిలేదు. గ్రామజీవనం సంతృప్తికరంగాలేదు. అసంతృప్తి, అనారోగ్యం, ఆర్థిక దుస్థితి, స్వైరవిహారం చేస్తున్నాయి. దీనికి అవిద్య కారణం. అజ్ఞానం కారణం. సాంఘిక పరిజ్ఞాన శూన్యత, సహకారభావనాలేమి కారణం. శాంతిని సాధించాలి. ప్రశాంత వాతావరణాన్ని సృష్టించాలి. దీనికి తగిన కార్యకర్తలు, నిర్మాణకర్తలు కావాలి. ఈ కార్యకర్తలు ప్రజలను ఆకర్షించాలి. అన్ని పనులలోను సమర్థులుగా వుండటం మంచిది - వాటపద్యం పాడగలిగినవారుగావుండి దాని అర్థం గ్రామీణులకు బోధించగలిగిన పాండిత్యంకూడా వుండటం మంచిది. గ్రామాలకు ఏ విషయాలు అవసరమో ఆ విషయాలలో సంపూర్ణమైన విషయ పరిజ్ఞానం వీరికి వుండాలనడం నిర్వివాదమైన విషయం. గ్రామాన్ని ఆర్థికంగాను, సాంఘిక రంగములోను, రాజకీయాది సమస్త విషయాలలోను వృద్ధిచెయ్యాలి. అవసరమైనచోట - అవిద్యకారణంగా అజ్ఞానం. అలముకొనివున్నచోట, పాతపద్ధతులకు స్వస్తిచెప్పించి కొత్త పద్ధతులను ప్రవేశపెట్టాలి. తానుచేసే ప్రతి పనిని ప్రజలు అనుసరించే ఆకర్షణీయమైన పద్ధతిని అవలంబించాలి. తానుచెప్పే ప్రతి విషయం వారు ఉత్సాహంతో ఆలకించే పద్ధతి ననుసరించాలి. ప్రజలను తన అనుచరులుగా చేసికొని, ఏపనిచేసేవారికి ఆ పనిలోనూ - ఏతరహా మనుష్యులకి ఆతరహాలోనూ సలహాలు యిస్తూ - సర్వసమర్థత్వముకలిగి సేవానిరతితో, సర్వమానవ సమానత్వమును చూపుచు సహానభావముతో, సర్వజనాకర్షణీయముగా సంచరించిననాడు - కార్యకర్తలు పునఃసృష్టిని సకాలంలో సాధించకల్గుతారు.

ప్రతి చిన్న విషయంలోను మార్పుయొక్క అవసరం కనబడుతోంది. ఎందుచేతనంటారా - కాలం శరవేగంతో ముందుకి పరుగిడిపోతోంది. ఇది వైజ్ఞానికయుగం. సాంకేతిక శాస్త్రమునకు ప్రాధాన్యం ఎక్కువ. అణుశక్తిని కనిపెట్టిన నవయుగంలో వున్నాము. ఈ యుగ ధర్మానికి అనుగుణ్యంగా వుండాలి. సోషలిష్టు సమాజ వ్యవస్థను స్థాపించాలని ప్రభుత్వం కృషిచేస్తోంది. గ్రామం అన్ని విధాల స్వయం పోషకంగా వుండటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. పంచవర్ష ప్రణాళిక తరువాత పంచవర్ష ప్రణాళికలు తయారవుతున్నాయి. గ్రామభూమియంతా గ్రామానికే చెందటానికి వినోభా భావే వంటి మహాత్ములు కృషిచేస్తున్నారు. ఈ తరుణంలో ప్రజలూ, గ్రామాలూ చతికిలబడి కూర్చోటానికి వీల్లేదు. ప్రతి గ్రామీణుడు నడుంబిగించి పనిచేయవలసిన సమయమాసన్నమైంది. తప్పుకనబడుతుందో దానిని వెంటనే ఒప్పుగా మార్చివేయాలి. ఎక్కడ ఎక్కడఅక్రమ పద్ధతి అనుసరింపబడుతూ వుంటుందో తక్షణం దానిని సక్రమ పద్ధతిలోనడిపించ ప్రయత్నం చెయ్యాలి. ఉపేక్షచెయ్యటానికి వీలులేదు. అలక్ష్యం పనికిరాదు - గ్రామస్థులందరూ కక్షలకి కార్పణ్యాలకీ స్వస్తిచెప్పి, వారానికొకసారి తప్పకుండా ఒకచోట కలుసుకోవడం, తమ సమస్యలను తెలుసుకోవడం, పరిష్కార మార్గములు ఆలోచించుకోవడం మంచిది. ఈ గ్రామం ఇలా వుండాలని గాని, ఈ సమస్య ఇలా పరిష్కరించుకోవాలనిగాని ఒక సూత్రం చెప్పటానికీ, ఒక శాసనంచేయటానికీ వీలులేదు. ఒక గ్రామానికి ఒప్పిన విషయం మరొక గ్రామానికి ఒప్పదు.

మన హిందూదేశంలో శీతోష్ణపరిస్థితులు — వివిధ ప్రదేశాలలో వేరు వేరు రీతులుగా వున్నాయి. దట్టమైన అడవులు, ఉన్నతమైన పర్వతములు, అతి శీతలమైన ప్రదేశాలు, అత్యుష్ణతగల ప్రాంతాలు, అమితంగా వర్షంపడే భూభాగాలు, అసలు వర్షపు చుక్కనే ఎరుగని ఎడారి భూములూ కూడా వున్నాయి. అందుచేత గ్రామాలలోవున్న ఈ లోటును — ఈ విధంగా భర్తీచేసుకోవాలని చెప్పడం కష్టం. సర్వసాధారణమైన సూత్రాలు మాత్రమే నిర్ణయించగలరు. అట్లా నిర్ణయించి సూత్రీకరించిన విషయాలే ఈ పుస్తకంలో చర్చింపబడినాయి. ప్రజలలో ఆసక్తిని కలిగించటానికే ఈ పుస్తకం ముఖ్యంగా ఉపయోగిస్తుంది. ఆసక్తి అనేది ప్రజలలో కలుగుతే, తమకు ఏదికావాలో వారే తెలుసుకుంటారు. ఎట్లా సాధించాలో వారే ఆలోచించుకుంటారు. ఈ నవయుగంలో సుఖంగా జీవిద్దామనే అభిలాష ప్రజలలో కలుగచెయ్యాలి. హృదయపరివర్తన జరిగించాలి. కక్షలను, కార్పణ్యాలను దూరంగా వుంచాలి. బద్ధకాన్ని దగ్గర చేరనియ్యకూడదు. శ్రద్ధగా పనిచేయడం నేర్చుకోవాలి. ప్రతి చిన్న విషయంలోను శ్రద్ధ వహించడమే కాకుండా, పొదుపును నేర్చుకోవడం, దుబారాను తగ్గించటంకూడా అలవాటుచేసుకోవాలి — ప్రజల సహకారమంటే ఏమీలేదు — ప్రజలు శక్తివంచన లేకుండా పనిచేయడం, వస్తూత్పత్తిని అధికం చెయ్యడమే ప్రజాసహకారమంటే. ప్రతి కార్మికుడూ, కృషికుడూకూడా చేసేపని తనదైనా ఇతరులదైనా ఒళ్ళు దాచుకోకుండా, దుబరా చెయ్యకుండా, శక్తివంచనలేకుండా, మామూలుకంటేకూడా ఎక్కువ బాధ్యత వహించి, అనుకున్న దానికంటే కొంచెము అదనముగా పనిచేయడమన్నే ప్రజాసహకారమంటే, శక్తికొలదీ పనిచేయకపోవడం సాంఘిక ద్రోహం వంటిది. దీనిని ప్రభుత్వము మెచ్చదు. భగవంతుడూ మెచ్చడు. ప్రభుత్వమునకు నచ్చకపోతే శిక్ష వేస్తుంది. ప్రభుత్వాన్ని కనుగప్పి తిరిగినా తిరుగవచ్చునేమో గాని — భగవంతుని కనుగప్పి తిరుగటం బ్రహ్మతరంగాదు. నీవు కూడబెట్టిన, సొమ్ము అన్యాయార్జితమైతే హారతి కర్పూరంలాగా హరించుకుపోతుంది. అసాధారణమైన గాలి వానలకీ — అగ్ని ప్రమాదాలకీ గురిఅవుతుంది. తుపానువచ్చి తుడిచిపెట్టుకుపోవచ్చు — భూకంపంవచ్చి భూమిలో పాతిపెట్టుకుపోవచ్చు, తెలిసిందా — జాగ్రత్త!

ధనికవర్గమనీ, దరిద్రవర్గమనీ కార్మికవర్గమనీ, కర్షకవర్గమనీ ఒకరిమీద ఒకరు పోటీలుపడి — కక్షలు కట్టుకొని ఈర్ష్య అసూయలతో తండ్రీ కొడుకులు, అన్నదమ్ములూ, ఆ కులమువారు, ఈ కులమువారు, ఆ మతమువారు, ఈ మతమువారూ, తగాదాలు పెంచుకొని పోట్లాడుకొని కాట్ల కుక్కలవలె కోర్టు కెక్కడంకన్నా, అందఱూ ఏకమై సాధించగలదేమన్నా వున్నదాయని ఆలోచించడం మంచిది. మీసాలు పెంచితే పెరుగుతాయి—గొరిగితే పోతాయి. అలాగే కక్షలు పెట్టుకుంటే వుంటాయి. సమరసభావంతో పరిష్కరించుకుంటే పోతాయి. ఇద్దరు అన్నదమ్ములు ఒక పొలంకోసం పోట్లాడుకొని కోర్టు కెక్కడంకన్నా — ఆ ఇద్దఱూకలిసి పనిచేసుకొని ఆ పొలంనుంచి ఎక్కువ లాభం పొందడంకోసం ప్రయత్నించటం మంచిదికాదా?

గ్రామాలలో పాత పద్ధతులు పనికిరావటంలేదు. క్రొత్త పద్ధతులు తొంగిచూస్తున్నాయి. వర్ణవ్యవస్థలు వాటికి సంబంధించిన వ్యక్తులు - వృత్తులు నశించిపోతున్నాయి. వర్గ వ్యవస్థలు. వాటికి చెందిన సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. అందఱూ ఏకము కావాలి. సహకారభావంతో పనులు సాధించుకోవాలి. ఐకమత్యంతో జీవించాలి, సహనభావంతో సమస్యలు పరిష్కరించుకోవాలి, ఇది ప్రజలు చేయవలసిన సహాయం.

అసలు మానవుడు. స్వార్థపరుడు. ఫర్వాలేదు తన బాగు తను చూచుకుంటాడు. మంచిదే. తను ఎక్కువ లాభం పొందటానికి పొంచి వుంటాడు - తప్పులేదు. తను సంఘంలోనివ్యక్తినని క్షణకాలం మరచిపోతాడు ఇదీ పొరపాటు. తోడి సోదరులను దగాచేయ

బోతాడు _ ఇదీ అపచారం. దోపిడీచేసి డబ్బును మూలగబెట్టుతానంటాడు. ఇట్లా అట్టే కాలం అనుభవించలేడు. అభివృద్ధి చేయనూలేడు - ఇతరుల సహాయం అతడికి కావలసి వస్తుంది. ఆర్జించిన ధనం, ధనంరూపంలోనే వుంచగలడా? వుంచడు. వుంచలేడు. రూపాయిలు రూపాయలపళంగా మ్రింగలేడుకదా! ఏ పొలమో - పుట్రోకొ నాలి - ఏ ఇల్లో వాకిలో _ ఏ తోటనో దొడ్డినో సంపాదించాలి. వాటి ఫలసాయాన్నిగదా అనుభవించాలి? ఒక్కడూ ఎంత మేర పొలం దున్నుతాడు? ఎన్ని యెకరాల సేద్యంచేయ కలుగుతాడు? అతడికి ఇతరుల సహాయ సంపత్తి కావలసి వస్తోంది. అతని పొలం దున్ని పెట్టటానికీ - అతని ఇనుపపెట్టె కాపాడటానికి - అతని భవనం శుభ్రపరచటానికి - అతడి పశువులను మేపడానికి - పంటలు ఓ కంటితో కనిపెట్టడానికి - అతని వాహనాలు మోయటానికి - అతని గుడ్డలు నేయటానికి - అతనికి జీవితావసరమైన ప్రతి వస్తువునీ అందించటానికీ - అతడు ఇతరులమీద ఆదారపడవలసి వస్తుంది. ఏ ఇతరులమీద ఆధారపడవలసి వస్తుందో ఆఇతరులనే తను కూడగట్టుకొని - వారికీ తనకూ లాభించేవిధంగా గ్రామ సమస్యలు పరిష్కారం చేసుకుంటే, బీదవాడు గొప్పవాడవుతాడు, ధనికుడు మరింత ధనవంతుడవుతాడు.-ఏ ఒక్కడూ స్వతంత్రుడు కాడుగదా! స్వతంత్రించి జీవితం సాగించలేడు! ఈ ఆధునిక యుగంలో అసలు వీలులేదు మరి!_ అందుచేత ధనికుడైనా దరిద్రుని సహాయం కోరవలసి వస్తుంది. దరిద్రులు కడుపులు మాడ్చుకొని ధనికునికి ఎంతకాలం సహాయం చేస్తారు? చిరకాలం చేయలేరు - ఇకముందు చేయరు కూడా _ అందువల్ల ధనికులంతా పరులకు హాని కలిగించే స్వార్థాన్ని త్యజించి _ సకలార్థ సాధకంగాను సకల మానవ కళ్యాణాత్మకంగాను, వుండేపనులు చేస్తేనే. ధనికవర్గం ధనిక వర్గంగా వుంటుంది. లేకపోతే పతనమైపోతుంది జాగ్రత్త!

ధనిక వర్గము _ దరిద్రవర్గము - కార్మిక వర్గము_ కర్షక వర్గము - ఎప్పుడూ ఈ ప్రపంచములో వుంటున్నాయి. ఇకముందుకూడా వుంటాయి. అందఱూ ఎప్పుడూ ఒక్కటే కాలేరు. అందఱూ ధనికులవడం గాని, అందఱూ దరిద్రులవడంగాని ఎప్పుడూ పొసగదు. ఒకవేళ అటువంటిది ఏర్పడినా ఆ ట్టేకాలం మన్నదు - హెచ్చు తగ్గులు - శీతోష్ణములవంటివి. ధనికవర్గము - దరిద్ర వర్గము భూమినగల ఎత్తుపల్లాలవంటివి. మెరక వుంటేగాని - పల్లానికి నీరెక్కదు. పల్లం వుంటేనేగాని మెరకవల్ల ప్రయోజనంలేదు. మనకి అసలు పల్లపు పంటా కావాలి! మెరక పంటా కావాలి!- మిట్టపల్లాలు ఏకంచేసే ప్రభుత్వాలు మనకు వద్దు. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అరికట్టే సామ్రాజ్య స్థాపనకాదు మనకు కావలసింది _ అందరికీ సమాన అవకాశాలు కలిగించి - వారి తెలివితేటలు వృద్ధిచేసుకొనే అవకాశం, స్వేచ్ఛ, యివ్వగల ప్రజా స్వామ్య పద్ధతులమీద స్థాపింపబడే ప్రభుత్వం కావాలి మనకి. ప్రజాస్వామ్యంతోకూడిన సోషలిస్టు. సమాజ వ్యవస్థను సృష్టించటానికే నెహ్రూవంటి దేశనాయకులు కృషి చేస్తున్నారు. వారి కృషి ఫలిస్తుంది. ఈ దారుణమైన ఆర్థిక అసమానత్వము తొలగిపోతుంది. సదవకాశాలు అందరికీ అందుబాటులో వుంటాయి - వాటిని సామర్థ్యంతో సంపాదించి బుద్ధిబలంతో నిలబెట్టుకొని నిశితమైన విజ్ఞానంతో నిర్వహించటంలోనే వ్యక్తిగతాభివృద్ధి ఆధారపడివుంటుంది.

చామాపాయాని సమాన ప్రతిపత్తిగల జీవన పరిమాణాన్ని పెంపొందించటానికే ప్రజా ప్రభుత్వం పని చేస్తోంది. వారి కృషి ఫలించుగాక!

నీవు భగవత్ప్రసాదితమైన నీ దేహాన్ని శుచిగాను సుందరంగాను వుంచుకొనటమే కాకుండా - నీ దేహానికి అత్యంతావశ్యకమైన - నీ గృహాన్నీ, గృహ పరిసరాల్నీ - నీ పల్లెనీ పట్టణాన్నీ - యావద్భారత దేశాన్నీ ఆరోగ్యవంతముగా నుంచుకొని ఆనందమయ జీవితాన్ని గడుపుదువుగాక - సాటి దేశాలలో సభ్య మానవునివలె ప్రవర్తించెదవుగాక!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

— సర్వేజనాః సుఖినోభవన్తు —

# తెలుగు ఉగాది

"భగవత్కుమార"

ఉగాది పండుగ వచ్చిందంటే
ఉల్లాసమెమాకందరికీ.
వేకువజామునె మేమంతా
శుభ్రముగా తలయంట్లు పోసుకొని
క్రొత్తక్రొత్తగా ముస్తాబయ్యి
పరుగున వచ్చాము మ్మ దగ్గరకు.
వెనువెంటనే మా అమ్మ అందరికి
వేప ప్రసాదము పెట్టినదీ.
తీపి చేదులతో వుగాది చట్నీ
తినటానికి బల్ బాగుందీ.
తీపి చేదుల మిశ్రణమ్ములో
మేళవించినది కమ్మదనం
"అమ్మా! అమ్మా! మాకొక సందియ
మున్నది తీర్చెదవా?"అనిఅడిగాం
"సందేహమ! అది చెప్పండి బాబూ!"
అనుచు పలికినది అమ్మ నవ్వుతూ.
"ఈ ప్రసాదములో తీపి చేదులకు
అర్థమేమిట"ని అడిగామూ!
అమ్మ పకపకా నవ్వినదీ.
"జనులారా! మీరందరు నీతిగ
సంచరింపుడని" హితమును చెప్పెను

అందులో తీపికి అది అర్థం.
"చెడులో దిగకోయ్ చెడిపోతావ్" అని
హితమును చెప్పెను అందులో చేదు.
"కావున ఓ భావి బాలల్లారా
విచ్చీ విచ్చని మొగ్గల్లారా!
చెడ్డబుద్ధులకు సలాముకొట్టి
సన్మార్గంలో నడవండోయ్;
విద్యా బుద్ధుల నన్నిట నేర్చి
భారత మాతకు పేరు ప్రతిష్టలు
కొనితెండోయ్ ఓ బాలల్లారా!"
అని బోధించెను మాకందరికీ.
అమ్మవాక్కులలో అంతరార్థమును
గ్రహియించిన మేమందరము
అలానె నడిచెదమని మేమంతా
అమ్మ ఎదుటనే ప్రతిన జేసితిమి.
వెనువెంటనె మేమందరమూ
ఆట పాటలకు పరుగెత్తాము
ఆ తరువాతను పాఠాల్చదువగ
పుస్తకంబులను తెరచితిమి.
పెద్దగ పాఠాల్ వల్లించాము.
ఉగాది పండుగ వచ్చిందంటే
ఉల్లాసమె మాకందరికీ.



# బిడ్డలు - తల్లిదండ్రులు

——(౦)——

## నిర్మాణాత్మక క్రమ శిక్షణ

శ్రీ కె. వెంకట్రామయ్య

(గత సంచిక తరువాయి)

### క్రమశిక్షణ పద్ధతులు :-

1. చేసిన తప్పునకు సరియగు దండన సాధారణముగా దాని సహజ ఫలితం అనుభవించుటయే కాగలదు. వేడెక్కిన "టీ" పాత్రను ముట్టవలదని యెంత వారించినను వినక ముట్టగోరెడి బిడ్డను కొంచముగా ఒక వ్రేలితో ఆ పాత్రను తాకనిచ్చుటయే మంచిది. వ్రేలు కొంచం కాలి చుఱ్ఱుమనుట నిజమే గాని, పూర్తిగా ముట్టుకొని ప్రమాదమును దెచ్చుకొనకుండుటకై మన మతనికడనే యుందుము గదా! అసలే ముట్టనీయక ఆటంకపరచినచో మనం లేకుండగ జూచి అతడా పనిజేసి ప్రమాదకరంగా కాల్చుకొనగలడు.

బడికి పోవలసిన బిడ్డ భోజనమునకు రమ్మని ఎంత పిలిచినను రాక ఆలస్యం చేయుచున్నాడనుకొనుడు. అప్పుడతనినిక పిలువక, అన్నమును వడ్డించి ఊరకుండుట ఉత్తమం. బిడ్డ అన్నమున కాలస్యంగా వచ్చినచో చల్లారిన అన్నమునే తినవలసి యుండును. బడి కాలస్యంగ పోయినచో తిట్లను పడవలసి యుండును.

స్వకార్యములపై నిగ్రహమును జూపగల వయస్సు బిడ్డల నడవడికనుగూర్చి మనమేమియు గడబిడ చేయరాదు (fuss) ఎక్కడికో కులాసాగా పోతలచితి మనుకొనుడు. బిడ్డ రాక ఆలస్యం చేయుచున్నాడనుకొనుడు; అప్పుడు అతని నింట వదలిపోవుటయే సరియగును. మన "ప్లాను"నకడ్డువచ్చెను గనుక మనమే పోకుండుట కొన్ని సమయములలో అతనికి మంచి పాఠముగా పరిణమించును.

2. అల్లరిచేయు బిడ్డ నితర పిల్లలతోనుండనీయక ఒంటరిపరచుట మంచి శిక్షణ విధానమే యగును. బిడ్డ ఇతర పిల్లలతో నుండగోరినను, ఆడుకొనగోరినను, వారి అందరి ఆనందమునకును సహాయపడెడి రీతిగ మెలగవలెను. అట్లుగాక, ఇతరులతో సరిగా నాడక బాధించుచుండినచో వారినుండి వేరై, ఒంటరిగానుండుటయే మంచిది. బిడ్డ నితరులనుండి ఒంటరిపరచుటకు కారణమిదియే కావలెను. అట్లాతని నొంటరిపరచునపుడు ప్రశాంతత జూపవలెనేగాని, ఉద్రేకమును, అలజడిని జూపరాదు. ఒక్కొక్కప్పుడు ఒక చిన్నబిడ్డ మనమాట ప్రకారము వేరుస్థలమునకు బోక పంతగింపగలడు. అట్టియెడ అతని నెత్తుకొనిపోయి అవతలనుంచవలసినదే. అతడు శాంతపడి ఇతరులతో సహకరింప నిచ్ఛగించినప్పుడు తిరిగి లోనికి రావచ్చును. అతని కోపోద్రేకమునకును, ఏడ్పునకును వెరచి లోనికి రానీయము. ఆ కోపోద్రేకమెంతకాల మున్నను లెక్కసేయము.

3. బిడ్డకు సంతోషకరమును, సంతృప్తికరమును అగు విషయములను, ఆటవస్తువులను లేకుండజేయుట కొన్ని సమయములలో సరియగు శిక్షణపద్ధతియే యగును. అట్లు చేయునపుడు ప్రత్యేకముగా ఇష్టమైన దానినే జూచి లేకుండజేయుట ముఖ్యము.

4. బిడ్డ నేదో పనిని చేయుమని మర్యాదగా అడిగితిమనుకొనుడు. చేయ నిరాకరించె ననుకొనుడు. దానికి మనమేమియు ననుకొనక ఊరకుండి మరల, కొలదిసేపైన పిదప నడుగుటయే కొన్ని సమయములందు సరికాగలదు. ఈ సందర్భమున మనమును,

(162-వ పేజి చూడుడు)

# "హాస్యరచయితలు — పానుగంటి"

## శ్రీ ఆకుండి వెంకటశాస్త్రి

...—...

అగ్రగణ్యులైన హాస్యరచయితలలో పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారొకరు. ఈ కోవలోనివారే కందుకూరి వీరేశలింగము, చిలకమర్తి లక్ష్మీనరసింహము గురజాడ అప్పారావు పంతులు మొదలైనవారు. 1900 సంవత్సర ప్రాంతమున ఆంధ్రదేశములో కూడా యావద్భారత దేశంతో పాటు స్వదేశ, స్వరాజ్య ఉద్యమాలు ప్రజల నాకర్షించాయి. ఇవిగాక ప్రత్యేకముగా ఆంధ్రదేశములో ఒక ప్రక్కనుండి సంఘ సంస్కారము, వేరొక ప్రక్కనుండి గ్రామ్యభాషా విప్లవము ఆరంభమైనాయి.

పానుగంటివారి రచనలలో యీ సమస్యలన్నీ తలస్పర్శగా చర్చింపబడ్డాయి. సంఘములోని లోపాల్ని హేళన రూపంగా ప్రకటించడంలో ఆయన సిద్ధహస్తుడు. పానుగంటివారికి గ్రామ్యభాషా ప్రచారము గిట్టదు. భాషా విప్లవవాదులను తమ రచనలలో ఆయన మిక్కిలిగా అపహాస్యముచేశారు. హాస్యరీతిలోనే రాజకీయాందోళనములోని ఆవశ్యకతను నిరూపించారు. స్వదేశీ, స్వభాషా, స్వమతాభిమానములను పురికొల్పడమే వీరి వ్యాసములలో ప్రధానాశయముగాను, ప్రధాన వస్తువుగాను కనబడుతుంది.

'షేక్స్పియర్'వలె యీయన ముప్పదియేడుకు మించిన నాటకములు, అయిదారు సంపుటాల సాక్షి వ్యాసములు, పెక్కు విమర్శనములు, చాల పుస్తకములకుపోద్ఘాతములను రచించినారు. ఈయన నాటకములన్నింటికిని కూచి నరసింహం పంతులుగారు నాందీ ప్రస్తావనలు వ్రాసిరి. కవి ప్రశంసకు స్థానమైన నాందీ ప్రస్తావనలలో ఆత్మస్తుతిని పరిహరించుటకు కాబోలును వీరీ మార్గము ననుసరించినారు.

1913 లో ప్రారంభించిన సాక్షి వ్యాసములు తొలుత సువర్ణలేఖా పత్రికలోను పిదప ప్రసిద్ధ పత్రికలలోను ప్రచురింపబడ్డాయి. సాక్షివ్యాసాలు ప్రకటింపబడిన పత్రిక యెప్పుడు వచ్చునాయని దానిని చదువవలెనని, ఈ నాడు వార్త ఫలాలకోసం కనిపెట్టుకొన్నట్లుగా చదువరులు కనిపెట్టుకొని ఉండేవారు. సాక్షివ్యాసాలు 'ఎడిసన్' వ్రాసిన స్పెక్టేటరు వ్యాసములను పోలియుండేవి. అసలు సాక్షి అనే పేరే స్పెక్టేటరు అనే పదాన్నుంచి తీసి ఉంటారు. అయినా విషయమంతా స్వతంత్రమే; అనువాదము కాదు.

సాక్షివ్యాసాలలోని వస్తువు ఆంధ్రదేశమే. సత్యపురం అనే ఒక పురం కల్పించారు. అందులో సాక్షి సంఘము స్థాపించారు. సాక్షి సంఘ సభ్యులకు MSS అని అంటామన్నారు. అనగా మెంబర్ ఆఫ్‌ది సాక్షిసంఘము. ఆంగ్లభాషా వైముఖ్యాన్ని, ఆంధ్రభాషా ప్రాముఖ్యాన్ని స్థాపించడంకోసం MSS. అంటే మేన్యుస్క్రిప్టు అని అర్థమౌతుంది కాబట్టి స.సా. సం.స. అంటామన్నారు. అంటే సత్యపుర సాక్షిసంఘ సభ్యుడు అన్నమాట. ఈ సభ్యులలో మొదటివాడు కాలాచార్యుడు. ఈతడు పొట్టివాడు, లంబోదరుడు. తారుకంటె నల్లనివాడు, ప్రవేశరుసుము యివ్వలేనివాడు. అందువల్ల వెట్టి సభ్యుడు. రెండవవాడు జంఘాలశాస్త్రి. మూడవవాడు వాణీదాసుడు, కవి ఎడమచేయి వాటముకలవాడు. అసూయకలవాడు. సోమరి. ఆదికవియైన నన్నయ్యభట్టు మొదలుకొని ఆధునిక కవియైన నాసాహెబు వరకు అందరు కవులను దూషించువాడు. నాల్గవ సభ్యుడు బొర్రయ్యసెట్టి. సంఘభవన ద్వారమునుండి లోనికి రాలేనంత లావైనవాడగుటచేత వీధి యరుగుమీద కూర్చుండును. ఇత్యాదిగా యీ సభ్యుల వర్ణన నడుస్తుంది. ఈ వ్యాసాలలో చర్చింపని విషయములేదు. అత్యాధునికమగు శాస్త్రచర్చలు హాస్యధోరణిలో నడిపింపబడ్డాయి. పరిణామవాదము (The theory of Evolution)

గుణసంక్రమణవాదము Mendelism స్త్రీ పురుష సమానత్వచర్చ మొదలుకొని 'రంజాన్' పండుగ, తోలుబొమ్మలాటలు, కాయగూరలను కాశీలో వదలిపెట్టుట వరకు అన్ని విషయాలు యిందులో కూలంకషముగా చర్చించి, వదలిపెట్టినారు. నడుమ నడుమ వాణీదాసుని కవిత్వము బొజ్జయ్యసెట్టి పిసినిగొట్టుతనము, కాలాచార్యుని పొడుము కక్కుర్తి వెక్కిరింపబడ్డాయి. సాక్షి వ్యాసాలలో భాష చాల చిత్రముగా ఉంటుంది. కొన్ని మాటలకు క్రొత్త సమాసాలు కల్పింపబడతాయి. త్రిఫల పులుసు తింటే త్రికలు వెడతాయి, అంటాడు. అనగా పప్పు పులుసు తింటే కక్కులు వెడతాయి అని కవిత్వాన్ని వెక్కిరిస్తూ దీపావళి సామానువలె నిందులో "అర్థనాశక శబ్దాడంబరము" ఉన్న దంటాడు.

చిన్న చిన్న వాక్యాలతో, ఒకే రకము క్రియా పదాలతో ఎంత చమత్కారం పుట్టిస్తారో చూడండి "దాదాపు ఐదు మాసములనుండి మా సత్యపుర సంఘ వ్యాపారములు చల్లబడినవి. సభాశాల తలుపు పై గొళ్లెము పడినది. జంఘాలశాస్త్రి నోటికి తాళము పడినది. కాలాచార్యుని ముక్కునకు దిబ్బడ పడినది. వాణీదాసుని పాళీ మూలబడినది. బొజ్జయ్య సెట్టి తామర కుష్ఠులోబడినది. సువర్ణలేఖా పత్రికలోనుండి 'సాక్షి' అను అక్షరద్వయము తుడువబడినది. మేము యివ్వవలసిన అర్దైకై వ్యాజ్యము పడినది. స్వీయచరిత్రావశ్యకతను గూర్చిన వ్యాసములో వాని ప్రాముఖ్యమును తెల్పుచూ, మనకు ఏనాడో మరణించిన ఆంగ్ల కవులనుగూర్చి తెలియునుగాని నాలుగైదు వత్సరముల క్రితం కీర్తిశేషులైన ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు ఎప్పుడు కవిత్వమారంభించిరో భారతాంధ్రీకరణమునకు ఏల పూనిరో, మీలో నొక్కనికైన తెలియునా ?" అన్నారు. "జమీ దారుల డ్రాయింగు రూములలో 'కార్లైలు' కనపడునుగాని కందుకూరి వీరేశలింగం కనబడరే ! టెన్నిసన్ కనపడునుగాని దేవులపల్లివారు అగుపడరే" అని గద్దించినారు.

పానుగంటివారి నాటకములలో "కంఠాభరణము" ముఖ్యమైనదని చెప్పవచ్చును. పౌరాణికములైన నాటకములు 1. కల్యాణరాఘవము 2. పాదుకాపట్టాభిషేకము 3. వనవాస రాఘవము 4. విజయ రాఘవము అనునవి. చరిత్రాత్మకములైనవి ప్రచండ చాణక్యము, బుద్ధబోధసుధ. సాంఘికములైనవి విచిత్ర వివాహము, రాతి స్తంభము సరస్వతి మొదలైనవి. కంఠాభరణ నాటకములో ఎన్నో సాంఘిక లోపములు హేళన చేయబడినవి. పేరుకోసమై నానా తంటాలుపడి సన్మానములు చేయించుకొనువారిని, సుబ్బిసెట్టి షష్ఠిపూర్తి సందర్భమున వెక్కిరించినారు. సాహిత్యజ్ఞానమంతగా లేకపోయినను, పట్టుదలతో స్మార్తవిధులను నిర్వహించువారికి సోమావధాని ప్రతినిధి. పండితుడై మతిభ్రష్టయినవాడు పిచ్చిరామశాస్త్రి అర్థతాత్పర్యములు లేక ఛందస్సు ప్రధానముగా చెప్పెడు ఆశు కవిత్వమునకు భట్రాజులైన రామలక్ష్మణులుదాహరణములు. సుబ్బిసెట్టి పిసినిగొట్టు. అతని వదాన్యతనుగూర్చి చెప్పుటకేవియూ ఉదాహరణములు లేవు. అందువలన వైశ్యమహాసభకు పందిరికి చిట్టిమట్టాకు లిచ్చెననియు పిడుకలిచ్చెననియు పొగడినారు. కరపత్రములను ప్రోగుచేసి గళ్ళాపెట్టి దగ్గఱ పడవేయమంటాడు - జీలకఱ్ఱ మొదలైనవి పొట్లములు కట్టి యిచ్చుటకు - ఆశుకవులను మీ ఆశుకవిత్వము సంతకుబోవ ! విశాఖపట్నము వెఱ్ఱి అను పత్రి సుండక మీరేల యిక్కడకు వచ్చితిరని వారిని తరిమివేయును. పిచ్చి రామశాస్త్రి పండితుడగుటచే సూత్రాలలోకెల్ల 'రోరి' అను కౌముదిలోని సూత్రము అంత్యప్రాసకొరకుపాహరించును.

"మనయేవ మనుష్యాణామ్, జాయతే వర్ణసంకరః" అను శ్రుతియందు అతివ్యాప్తి దోషము తప్పకుండ పట్టినది. పట్టకపోయినయెడల మనకీశాలు నొప్పి యెందులకు పట్టును ? అని శ్లోకభాగములు విపరీతముగా కలిపికొట్టి తర్కశాస్త్రచర్చ ఆరంభించును.

సుబ్బిసెట్టి షష్ఠిపూర్తి సభలో కొంత శాస్త్రచర్చ నడపించినాడు.

కాత్రేనికోన బ్రాహ్మణు
లిట్రాకవి సెప్పగలరె యిలలో ధరణిన్
భట్రాజు మాంసకవితకు
ఎట్రా పపుచారు కవిత యీడొచ్చిల
లోన్.

ఇందులో ఇట్రా అనగా 'ఇట్లా' అని ర, ల, యోరభేదః అను సూత్రమును చెప్పించును.

కవి యనగా కవిత్వమని అర్థమున్నదా అని శంకించి,

"బండిరా పొగబండిరా
మండలంబున గంగదాసుడుండి యీ
కవి సెప్పిరా"

అని గంగదాసు మహాకవి నిర్ధారక ప్రయోగముదాహరించినాడు.

ఆంధ్ర సాహిత్య పరిషత్తు అధ్యక్షోపన్యాసములో "నేను పండితుడను కానని యీ యూరివారెరుగుదురు. పై గ్రామములవారూ యెరుగుదురు. సాహిత్యహీనతలో జగమెరిగినవాడను కాని సాధారణుడను గను. ఇట్టి నన్ను పరిషత్తువారేల యెన్నుకొనవలెనో నాకు దెలియదు. వెనుక జరిగిన పది పరిషత్సభలకు పండితుల నెన్నుకొంటిమిగదా యీసారి అపండితు నెన్నుకొందము, ఇంతలో జెడిపోవునదేమున్నదని యూహించి మార్పుకొరకై నన్నెన్నుకొని యుందురు" అని యెంత చమత్కారముగ వినయప్రకటన గావించిరో చూడుడు.

ఇట్లుదాహరణములు చెప్పవలసినచో పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారి గ్రంథములన్నియు యిచ్చట చదవడమే అవుతుంది. దిఙ్మాత్రముగ వారి రచనలనుండి కొన్ని యుదాహరణములు మాత్రమే యిచ్చట పరిశీలించాను.

ఐతే 'పానుగంటి'వారి గ్రంథములకు రావలసినంత ప్రాచుర్యమెందులకో రాలేదు. బహుశః వారి గ్రంథములు అంతో యింతో పాండిత్యమున్నవారికి గాని తెలియకపోవుట ఒక కారణము కావచ్చును. సాంఘికాది సమస్యల తీవ్రత కాలక్రమమున తగ్గుటయు, మారుటయు అనునది స్వభావము కావున ఆ యాందోళనము చల్లారిన వెంటనే ఆ సమస్యలంగూర్చి వ్రాసిన రచనల ప్రాముఖ్యము తగ్గవచ్చును. పైగా; హేళనకావ్యములు (Satires) పరిమిత ప్రయోజనము కలవగుట; వానికి శాశ్వతత్వము లభించదు. ఇంతకును పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు సరస్వతీ - కంఠాభరణము. ఇందులకాయన నిర్మించిన కావ్యప్రపంచమే సాక్షి.

(ఆలిండియా రేడియో, విజయవాడ కేంద్రము వారి అనుమతితో)

# ఉగాది ఉపదేశం

శ్రీమతి వడ్డి కృష్ణవేణి



అప్పుడే ఆఫీసునుంచి వచ్చి శ్రీమతి ఇచ్చిన కాఫీసేవించి ఈ జీచైరులోకూర్చున్నాడు ప్రకాశం. ప్రకాశం వింత మనోప్రవృత్తికలవాడు. ఎప్పుడూ ఎవరినో ఒకరిని ఏడిపించటం అతనికి సరదా. కూర్చీలో కూర్చున్నాడన్నమాటేగాని అతనికి తోచటంలేదు. కారణం ఏడిపించటానికి ఎవరు లేకపోవటమేనని పాఠకులు గుర్తించాలి. వెంటనే శ్రీమతి స్మృతి పథంలోకి వచ్చింది. శారద కాస్తమాటంటే చాలు ఏడుస్తూకూర్చుంటుంది. ప్రకాశం వెంటనే సీరియసుగా భార్యను పిల్చాడు. ఆమె ఏదో పనిమీదవుండి పలకలేదు.

"ఏమేవ్! ఇల్లారా" అంటూ గావుకేక పెట్టాడు.

"ఎందుకండీ అంతలో కేకలు? ఏం పనొచ్చిందిప్పుడు?"

"ఏం పనా! వల్లకాటిపని- తెల్సిందా?"

"బాగుంది మీవరస - మీతో ఏది మాట్లాడినా తప్పే."

"నాతో ఏది మాట్లాడినా తప్పయితే మాట్లాడం మానేసెయ్యి,"

"పోనీగానిండీ! మీరు పిలిచినపనేదో చెప్పండి."

"ఎల్లుండి పండగకదూ?"

"యేం పండగా! ఉగాది పండగకదూ!"

"పండగ యెల్లుండయితే నన్నేం చెయ్యమన్నారు?"

"నిన్నేంచెయ్యమనటంలేదు-మీ వాళ్లు పిలవలేదేమని అడుగుతున్నా?"

"మొన్ననేగా సంక్రాంతికి పిల్చారు. వాళ్ళను ముప్పతిప్పలుపెట్టి వచ్చారు చాలదూ!"

"నేను వాళ్లని తిప్పలు పెట్టానని అన్నావుగాని మరి మీవాళ్లుచేసిన పని బాగుందా!"

"మావాళ్లేంచేశారు?"

"ఏం చెయ్యాలి! నాకునచ్చని సిల్కు పంచెలెందుకు పెట్టాలి?"

"అయ్యో! ఇదేం చిత్రమండీ! దసరాకు నూలుబట్టలు పెడితే ఇవేం బట్టలు అల్లుడికి సిల్కు బట్టలు పెట్టాలిగాని అన్నారామెను. ఇప్పుడవి పెడితే అవిగాదంటె ఇంక మీకు పెట్టేదెలాగు!"

"పెట్టేవేమిటో అల్లుళ్ల నడిగి పెడతారా? మామగార్లు అల్లుళ్లముఖ వైఖరిని

బట్టి ఆయా సందర్భానుసారముగ నడుచుకో వాలి గాని ఏమి తెలియని నంగనాచుల్లాగ వుండటం బాగులేదు.''

''అల్లుళ్లని అందర్ని కలపకండి. మీ వంటి వింత మనోప్రవృత్తులు గల అల్లుళ్లుండటంచాల అరుదు. మానాన్న గారికి ఎన్ని జన్మాలసుకృతంవల్లనో మీరు దొరికారు. ఒక్క-గానొక్క కూతురునైనందుకు వారిమనసుకు సంతోషం లేకుండా పోయింది. ప్రతిపండగకు ఏదో ఒక పేచీలతో సరిపోతున్నది.''

''ఏమిటి నీవాగుడు? మీ వాళ్లకు సంతోషం లేదని విచారిస్తున్నావుగాని నాకు మాత్రం సంతోషంవుందా! మీ వాళ్ల చేతలకు నేను విచారిస్తున్నాను.''

''అందుకనే ఈ పండుగకు మన ఇంట్లో మనము, వారి ఇంట్లోవారు వుంటె అందరి మనసులు ఆనందంగా వుంటాయి. వారు పిలవలేదని అడగటమెందుకు? యిప్పుడు ఈ వాదోప వాదాలెందుకు?''

''ఎందుకేమిటి? అదొకసరదా, మామగార్లు అల్లుళ్ళని పిలవడం, వారు వెళ్ళటం మొదలయినవన్ని లాంఛనప్రాయాలు. అయినా ఈపాటికి మీ నాన్న వస్తూనే వుంటాడు.''

''ఈసారి ఖండితంగా నేను రానని చెప్తాను.''

''అబ్బో! ఈ మాటలకేంలే నాన్నే వచ్చి పిలుస్తుంటే వెళ్లకుండావుంటావా! అయినా చూస్తాగా ఎల్లా వెళ్లవో?''

''వెళ్లకుండా వుంటావా అంటున్నారు, మీరురారా?''

''నేనెందుకు? నేవస్తే మీవారి మనసులకు సంతోషంవుండదు. ఒక్క-గా నొక్క కూతురివైనందుకు నీవే వెళ్లు వారికి సంతోషంగావుంటుంది'' అంటూ ఒక గంటసేపు భార్యను ఏడిపించి బజారుకు వెళ్లాడు. శారద ఇంటిపనుల్లో నిమగ్నురాలయిందన్నమాటేగాని మనసులో చాల బాధపడుతున్నది.

మర్నాడు ఉదయాన్నే గోపాలంగారు కూతుర్ని అల్లుణ్ణితీసుకువెళ్లటానికి వచ్చారు. 'శారదా! అదుగో మీ నాన్నగారు వచ్చారు. కాళ్లు కడుక్కోటానికి నీళ్లుతెచ్చి ఇయ్యి' అని పిల్చాడు. కాని భర్తమాటలను నమ్మలేదు శారద. ''ఏమండీ! అంతాకులాసాయేనా? మీమాటే అనుకుంటున్నాము.'' అని మామగార్ని పలుకరించాడు.

''కులాసాగానే వున్నాము నాయనా. అమ్మాయి ఏది?''

''మీ అమ్మాయి నామాటనమ్మటం లేదు. మీరే పిలువండి''

"శారదా! ఏంచేస్తున్నావమ్మా?"

"ఆ! ఎంతసేపయింది నాన్నా! వచ్చి. వారంటుంటే వేళాకోళమనుకున్నా అమ్మ కులాసాగావుందా? ఏదో పనిమీద వచ్చినట్టున్నావు?"

"పనేముందమ్మా. రేపు ఉగాదిపండుగ కదూ. మిమ్మల్ని తీసుకు వెడ్దామని వచ్చాను. త్వరగా ప్రయాణమవండి."

"ఈసారి ఆయనరారట. నన్నే వెళ్లమన్నారు."

"అదేమిటి ప్రకాశం! మా అమ్మాయి కంటెనీవేముఖ్యమైనవాడివి. నీవులేని పండగేమిటి?"

"నేవస్తే మీకుసంతోషం వుండదని మీ అమ్మాయి విచారిస్తున్నది. అందుకని రానన్నాను."

"అదేమిటి శారదా! తప్పుగాదూ! అతనివల్ల మాకెప్పుడు విచారంలేదు."

"అదికాదునాన్న! నిన్నటినుంచి "నువ్వు పండుగకు పిలువలేదని అల్లుడిమనోభావాలు గ్రహించిబట్టలు పెట్టాలని అంటున్నారు. అందుకని ఏ బట్టలుపెట్టినా నచ్చవుకదా అల్లాంటప్పుడు అక్కడికెందుకు! మన ఇంట్లోనేవుంటే వారికి, మనకు సంతోషంగ వుంటుందని అన్నాను."

"తప్పమ్మా! అల్లాఅనకూడదు. అతనల్లా అనడంకూడా ఒక విధమయిన ఆనందమే. ప్రపంచధర్మం అంతే. మామగార్లు మీద అల్లుళ్లు అలగటం, ఎంతపెట్టినా అల్లుళ్లకు తృప్తిలేదని మామగార్లు మౌనమవలంభించటం అనాదినుంచి ఆచారమైపోయింది. అంతేగాని మరేంలేదు. ప్రకాశం త్వరగా ప్రయాణమవండి. సాయింత్రానికి ఇల్లు చేరకపోతే మీ అత్తగారు కంగారు పడుతుంది."

"అల్లాగేలెండి. శారదా! త్వరగా భోజనాలు పూర్తిచేసి ఇల్లు సర్దుకో-రైలు టయమవుతున్న"దని భార్యకుచెప్పి మామ అల్లుడు మాట్లాడుకుంటూ కూర్చున్నారు. శారద త్వరగా పనులన్ని చేసుకొని ప్రయాణమయింది. ముగ్గురుకలసి స్టేషనుకు చేరారు.

సాయింత్రమయిది గంటలకల్లా గోపాలంగారు కూతురు అల్లుడితో సహా స్వగ్రామం చేరుకున్నారు. శాంతమ్మగారి ఆనందానికి అవధిలేకుండావుంది. "ఇదుగో నీకూతురు అల్లుడు నీ కప్పచెప్పున్నా"నని గోపాలంగారనగానే "నాకేగాని మీకు మాత్రంకారా?" అని శాంతమ్మగారన్న మాటలకు అందరు నవ్వుకున్నారు. రాత్రి భోజనాలయినతర్వాత కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ పడుకున్నారు.

తెల్లవారింది అందరు తలంట్లుపోసు కొని పిండివంటలతో భోజనాలు చేసారు. క్రొత్తపండగపూట అందురు ఆనందం గావున్నారు. ప్రకాశంగదిలో పడు కున్నాడు. గోపాలంగారు పేపరుచదువు కుంటున్నారు. సాయంత్రమయింది. ఎప్పుడూ పెండలాడే అల్లుడికి బట్టలు పెట్టే గోపాలంగారు ఈసారి మాత్రం నావ కాశంగా కూర్చోని పేపరు చూస్తూ వుండటం శారదకు ఆశ్చర్యాన్ని కలుగ జేసింది. "నాన్నా! నాన్నా!" అని పిల్చింది.

"ఏమిటమ్మా శారదా!"

"సాయింత్రమయింది. మరి ఆయనకు బట్టలియ్యి."

"ఈ సారిబట్టలుకొనదల్చుకోలేదమ్మా. మొన్ననేగా పెట్టింది, చేతిలో డబ్బులేక ఇబ్బందిగా వుంది."

"అల్లాంటప్పుడు ఎందుకు పిల్చావు?"

"పిలిస్తే తప్పేముందమ్మా! క్రొత్త ఉగాదినాడు అందరము ఉల్లాసంగా కాలం గడపవచ్చని పిల్చాను."

"బాగుంది. ఆయన ఇంటికి వెళ్లాక బట్టలు పెట్టలేదని సాధిస్తుంటె నేను సహించలేను బాబు."

"మరేంచెయ్యనమ్మా! పోనీ కొట్లోకి వెళ్లి అప్పుతెస్తాలె" అని చెప్పి గోపాలం గారు బజారుకు వెళ్లబోతుండగా గదిలో నుంచి ప్రకాశంబయటకువచ్చి "మామ గారూ ఆగండి. ఇప్పటివరకు మీకు మీ అమ్మాయికిజరిగినసంభాషణంతావిన్నాను. మీరు బట్టలు పెట్టకుండావుంటేనె నాకు సంతోషంగవుంది. ప్రతిపండగకు అల్లుణ్ణి పిలవటం వారికినచ్చిన బట్టలు పెట్టడం మొదలయిన పూర్వాచారాలన్ని ఈనవ యుగంలో నశించాలని నా ఉద్దేశ్యము. అదీగాక మీకు ఒక్కగా నొక్క కూతురు కాబట్టి ఎల్లాగో పెట్టారు. మిమ్మల్ని ఆదర్శ ముగా పెట్టుకొని నలుగురు పిల్లలుగల కుటుంబము లెంత క్షోభిస్తున్నాయో తెల్సా? కాబట్టి ఈ రోజునుంచి నామాట విని ఈ వెర్రిలాంఛనాలుమానెయ్యండి. ప్రతిపండగ కంటె ఈ ఉగాది పండగే నాకెంతో సంతో షంగవుంది. లేనిపోని కొరతలు పెట్టుకొని మనసులు పాడుచేసుకోకండి," అని మామ గార్ని ఊరడించాడు. శారదా! "ఇదేనా నీ పుత్రీప్రేమ. నామూలంగ మీ వాళ్లకు సంతోషంలేదన్నావుగాని ఇప్పుడు నీవు చేస్తున్న పనేమిటి? తండ్రి కష్టసుఖాలతో నీకు నిమిత్తంలేదా?" అని భార్యను మంద లించాడు.

"నీవు చాలా మంచివాడివి ప్రకాశం. మామగార్ల కష్టసుఖాలను అవగాహన చేసు కున్న అల్లుడివంటె నీవే. నీవు చెప్పిన ఈ ఉగాది ఉపదేశాన్ని అల్లుళ్లందరు ఆ చరణలో పెట్టగలరని ఆశిస్తున్నా" మన్నారు. అత్తమామలు ఈ విళంబినామ సంవత్సరమే వారికుటుంబాన్ని ఆనంద సాగరంలో నోలలాడించిందని మురిసి పోతున్నారా ముసలిదంపతులు. మామ గార్లమీద దాడిచేసే నవీన అల్లుళ్లందరు ప్రకాశంగారి ఉగాదిఉపదేశాన్ని ఆచర ణలో పెట్టగలరని ఆశిస్తున్నా!

# అల్లుని కోరిక

శ్రీమతి ఓలేటి సూర్యప్రభ

మనియార్డరు పుచ్చుకున్నారు ఆనందరావుగారు. దానితోకూడా వచ్చిన కవరు చింపి చదివారు ఆశ్చర్యంతోనే. "అసలు మనియార్డరు ఎక్కడనుండి వస్తుంది నాకు" తనలో తనే ప్రశ్నించుకున్నారు. చదువుతూంటే ఆనందరావుగారి కళ్లు ఆనందంతో అశ్రువులు రాల్చాయి. ఆశ్చర్యంతో ఉక్కిరి బిక్కిరయ్యారు. అంతట్లో ఆయన ముఖం ప్రొద్దున్న కోసిన మల్లెపువ్వు సాయంకాలానికి అయినట్లు అయింది. ఆయన హృదయం సంతోషంతోనూ బాధతోనూ పెనవేసుకుంది.

ఇంతట్లో "మనియార్డరా! ఎక్కడనుండీ!" అంటూ ఇంటిల్లిపాదీ ఆయనచుట్టూ మూగారు. "ఆ, ఏదో పాతబాకీ, రాదనుకున్నదే, అయిదు రూపాయలు" అన్నారు ఆనందరావుగారు. తేలిగ్గా నిట్టూర్చి. అంతా చక్కాబోయారు.

## 2

"ఉత్తరం వచ్చిందండీ!" అంది సావిత్రి. "ఎక్కడనుండి" అన్నాడు సుబ్బారావు. "మా నాన్నగారు వ్రాశారండీ" అంది. అతను మౌనం ధరించాడు. సావిత్రి ఉత్తరం ఇచ్చింది.

"చిరంజీవి అల్లునకు ఆశీర్వచనములు. నేను చేసిన వాగ్దానం చెల్లించగలనని ఆశిస్తూ ఈ పండుగకు సకుటుంబంగా రావాలని కోరుచున్నాను. ఇక్కడ అందరం కులాసాగా నున్నాము. మీ అందరి క్షేమం వ్రాయగోరుచున్నాను. పాపకు దీవనలు. పండక్కి రావడానికి అంగీకారాన్ని తెలుపుతావని తలుస్తున్నాను.

ఇట్లు

C. ఆనందరావు"

చదివి బల్లమీద పడేశాడు. సావిత్రి అతని ముఖంలో ఏదైనామార్పు వచ్చిందేమో అని ఆత్రంగా చూసి ఎటూ పోల్చలేకపోయింది. "మూడేళ్లనుండి లేనిడబ్బు ఇప్పుడెలా వచ్చింది? అంతా నాటకం. తప్పిపోతే చాలునని ఊరుకున్నారు" అన్నాడు సుబ్బారావు. "కన్నకడుపు కాదుటండీ! ఎన్నాళ్లుండబట్టుకోగలరు? మీ పట్టుదల మీరు ఒదలరాయె. మన పాప పుట్టాక వాళ్లు చూడలేదుగదా? ఎలాగో కష్టపడి మీ కోర్కె చెల్లిస్తే మనం కళ్ళబడతాం అనేగా! వాళ్ళ బాధ. పండక్కి అక్కయ్యలందరూ వస్తారు. చూడాలనుందండీ" అంది ప్రాధేయపడుతూ. "సరే. కానీ" అన్నాడు గంభీరంగా ముఖంపెట్టి. సావిత్రి చిరునవ్వు నవ్వుకుంది తనలో. పాపను మోచేతుల మీద ఎత్తుకొని చరచర వంటింట్లోకి వెళ్ళింది. వాలు జడ వీపుమీద నాట్యంచేసింది ఆమె నడుస్తూంటే.

## 3

ఆనందరావుగారి అల్లుళ్ళూ-కూతుళ్ళూ అందరూ ఒక్కొక్కరే వస్తున్నారు పండక్కి. ఆఖరి కూతురు సావిత్రి మాత్రం రాలేదు. అక్కలందరికీ మనస్సులో బాధ మెదుల్తూనే ఉంది కడగొట్టు చెల్లెలు రాలేదని. ఆనందరావుగారూ రాజేశ్వరమ్మగారూ అహర్నిశలు వాపోతూనే ఉన్నారు. అయినా ఆనందరావుగారు మాత్రం ఆ బాధలోనే ఏదో కొంత తృప్తిపొందినట్లు కనబడుతున్నారు.

మధ్యాహ్నం పదకొండు గంటలైంది. అంతా భోజనాలకు లేస్తున్నారు. వచ్చేవాళ్ళలో నాలుగవ అల్లుడు మాత్రం ఇంకా రాలేదు. చీమ చిటుక్కుమంటే వీధివేపు చూస్తోంది రమ. ... వీధి తలుపు

దగ్గిర శబ్దం వినిపించింది. రమ వెళ్ళి తలుపు తీసింది. సావిత్రీ, పాపా, సుబ్బారావూ వచ్చారు రమ తన కళ్ళను నమ్మలేకపోయింది. నిజంగా సావిత్రేనా! మరదికి కోపం ఎలా తగ్గింది? ఆనందం పట్టలేక సావిత్రిని కౌగలించుకుంది. చిన్నప్పుడు రమా సావిత్రీ కవలపిల్లల్లా ఉండేవారు. ఒక్కమాటు విడవకుండా ఆడుకునేవారు. వాళ్ళక్కలంతా "రామలక్ష్మణులు" అనేవారు వీళ్ళిద్దర్నీ. రమకీ సావిత్రికీ రామలక్ష్మణుల కున్నంత ప్రేమ ఉంది నిజంగా.

పాపను ఎత్తుకొని ముద్దులవర్షం కురిపించింది రమ. సావిత్రి తల్లివచ్చి అల్లుడితో కుశల ప్రశ్నలు ముగించుకుని సావిత్రితో వంటింట్లోకి వెళ్ళింది. అక్కలందరూ వెంబడించారు సావిత్రిని. "సావిత్రీ ఎన్నాళ్ళయిందే నిన్ను చూసి. మేం మీఇంటికివచ్చినా మీ ఆయన మన్నుతిన్నవాడిలా సరిగ్గా మాట్లాడడాయె. అలాంటప్పుడు ఒకటి రెండు రోజులకంటె ఎలాగ ఉండడం! పోనీలే తల్లీ ఇప్పటికైనా వచ్చారు. సంతోషం. అర్థంలేనివాళ్ళు వ్యర్థులమ్మా!" అంది రాజేశ్వరమ్మగారు అవ్యక్తమైన బాధతో.

"సరే దానికేంగాని అలా అనుకోకే అమ్మా! ఇప్పుడొచ్చాంగా! రమ మొగుడు ఇవాళ వస్తాడా! అని రమవైపుతిరిగి ఏమే రమా!" అంది. "వాళ్ళ ఆయనకేమీ కోపంలేదులే మీ ఆయనలా" అంది చిన్నక్కయ్య.

"అలా అనకే సుబ్బారావు మాత్రం అలాంటి వాడాయేం! ఏదో గ్రహస్థితి" అంది పెద్దక్కయ్య. "అసలు కోపం ఎలా అదృశ్యమైంది మరదిగార్కి" అంది మూడో అక్కయ్య. సావిత్రి ఎవరికీ సమాధానం చెప్పలేదు. "అబ్బ. ఉండండర్రా మన మాటలు వినపడతాయి అవతలవాళ్ళకి" అంది.

4

బావమరదితో వేళాకోళాలాడుతూ కూర్చున్న సుబ్బారావు మామగారు రాగానే లేచి నిల్చున్నాడు. నేలను చూస్తున్న సుబ్బారావునిచూసి ఆనందరావుగారు లోపలే నవ్వుకున్నాడు.

"మేల్లో వచ్చారా! అంతా కులాసా!" అన్నారు. "కులాసాగా ఉన్నామండి" అన్నాడు సుబ్బారావు. "చాలా సంతోషం బాబూ! చిన్నవాళ్ళ కోర్కెలు తీర్చడం పెద్దవాళ్ళవిధి. అర్థిక లోపంలేకపోతే ఆనందంకూడాను" అన్నారు. సుబ్బారావు మౌనంగా నిల్చున్నాడు. "భోజనాలయ్యాక మాట్లాడుకోవచ్చు, రా బాబూ!" అంటూ లోపలికివెళ్ళి "సావిత్రీ! వచ్చావా! పాపయేదీ!" అన్నారు.

ఇదుగో నాన్నా! అని పాపను తండ్రికి అందిస్తూ తండ్రి కళ్ళల్లోకి చూసి నవ్వింది సావిత్రి. ఆయన కూతుర్ని ప్రేమగా చూస్తూ "ఇన్నాళ్ళకు మీ ఆయన్ను రప్పించగలిగినందుకు చాలా సంతోషంగా ఉందమ్మా!" అన్నారు. సావిత్రి సుబ్బారావుని కళ్ళతో పలకరించింది. సుబ్బారావు నవ్వుతూ ముఖం పక్కకి దాచుకున్నాడు. "నాన్నా! పాప పెద్దదయి ఆయనకుకూడా అల్లుడు వచ్చేదాకా డబ్బు విలువ, మనుష్యుల విలువ తెలిసిరాదులే" అంది.

"దానికేమిలేమ్మా! మేం పెట్టవలసిన వాళ్ళం గనుక కోరుకోడంలో తప్పేముంది!" అన్నారు అల్లుని నవ్వు కనిపెట్టి ధైర్యంగా.

5

సంక్రాంతి పండుగ ఆనందంగానూ సరదాలతోటీ గడచిపోయింది మూడు రోజులూ. ఆ తరువాత అందరు కూతుళ్లూ ప్రయాణాలయి వెళ్ళిపోయారు. సుబ్బారావుకూడా ప్రయాణం అవుతున్నాడు. తనకు ముట్టవలసిన ముడుపుకోసం ఎదురుచూస్తున్నాడు ఎరగనివాడిలా. మామగారూ భార్యాకలిసి ఆడుతున్న నాటకానికి తనుకూడా ఒక పాత్రగా తయారౌతున్నాడు.

"మామగారువచ్చి రెండు రోజులు ఇంకా సెలవుందిగా. వెళ్ళవచ్చులే" అన్నారు. "పనుందండి"

అన్నాడు సుబ్బారావు. "సావిత్రిని నేను తీసుకొస్తా. నెల రోజులుం మా యింట్లో ఉండి వస్తుంది" అన్నారు. "మీ ఇష్టం" అన్నాడు.

"ఇవి రెండు వందలు. నీ ఇష్టమొచ్చిన సైకిలు కొనుక్కో! ఈ నాటికి నువ్వు కోరింది ఇవ్వగలిగినందుకు ఆనందిస్తున్నా.' అని ఇంకో ముప్పయి రూపాయలు నూటుక్కూడా ఇచ్చారు తాంబూలంతో సహా "తీసుకో బాబూ!" అంటూ ప్రాధేయపడుతూ. అతను వినయంగా వంగి మామగారి పాదములు స్పృశిస్తూ నమస్కారం చేశాడు. మామగారి బాధ అర్థంచేసుకొని మనస్సులో జాలి పడ్డాడు.

రైలుదాకా సాగనంపడానికి పాపతోకూడా వచ్చిన మామగార్ని చూస్తూ తన నిర్దయత్వానికి పశ్చాత్తాపపడ్డాడు ఆ క్షణంలో. రైలు కదిలింది. పాపకు టాటా చెబుతూ రైలుతోపాటు సాగిపోయాడు సుబ్బారావు.

## 6

"సావిత్రీ! ఇంత డబ్బు ఎలా పంపగలిగావమ్మా! 50 రూపాయలతో ఇంత గొప్పగా సత్కరించిన గౌరవం నాకు దక్కించావు తల్లీ!" అన్నారు ఆనందరావుగారు సావిత్రితో. "ఎదటివాళ్ల కష్టసుఖాలు ఆయనకు తెలియవు నాన్నా! మనస్సు వెన్నలాంటిదే - డబ్బుకు విలువ ఇవ్వరు ఆయన. జీతంలో నెలనెలా పది రూపాయలు దాచినా నమ్మకమే నా యందు. ఇక్కడకు రాకుండా ఉండలేక ఈ పనిచేశాను. రెండేండ్లనుంచి దాచితే ఈ నూటఎనభైరూపాయలు పంపగలిగాను. అక్కల్ని చూసి సరిగ్గా మూడు సంవత్సరాలయింది" అంటూంటే సావిత్రి కళ్ళు చెమ్మగిల్లాయ్. "పాప పెద్దదయ్యేటప్పటికి నీ సొమ్ము నీకు ఇచ్చేస్తా తల్లీ! నేను రిటైరయితే గవర్నమెంటు కొంత డబ్బిస్తుంది నాకు. నీవు మనిఆర్డరు చేశావనికూడా ఇంట్లో ఎవళ్లకీ చెప్పలేదు. ఒకళ్లనుచూసి ఒకళ్లు కోపగిస్తే నేను చేసేదేముంది చెప్పమ్మా" అన్నారు.

"అలాగే నాన్నా! సొమ్ము మీ అల్లునికే ఇచ్చారుగాని మీరు తిన్నారా!" అంది సావిత్రి. "మేం పెట్టవలసినవాళ్లం కాదుటమ్మా ఉన్నా లేకపోయినా" అన్నారు ఆయన. "మా కిప్పుడేం లోటులేదు. మీరలా బాధపడగూడదు నాన్నా!" అంది సావిత్రి.

ఇంతలో రాజేశ్వరమ్మగారువచ్చి "ఏమిటి తండ్రీ కూతురూ చెప్పుకుంటున్నారు!" అంది.

"ఏమీ లేదే-మన సావిత్రి ఏంచేసిందో తెలుసా! మనం సుబ్బారావుకి ఇస్తామన్న సైకిలు కొనమని నూటఎనభై రూపాయలు పంపింది పండుగ ముందర" అన్నారు. రాజేశ్వరమ్మగారు విస్తుపోయి "ఆ వేళ మనియార్డరు అదా! సావిత్రి బోధవల్ల సుబ్బారావు తిక్కతిరిగి ఈ పండక్కు తీసుకువచ్చాడనుకున్నా" అంది. "ఎలాగైతేనేం సావిత్రి ప్రజ్ఞవలే తిక్కతిరిగింది అతనికి. ఈ సంక్రాంతి పండుక్కు అతను సావిత్రిని తీసుకురావడానికి, మనం అంతా సంతోషించడానికీ సావిత్రే కారణం" అన్నారు ఆనందరావుగారు.

సావిత్రి పుట్టింట్లో నెలరోజులు ఉంది. రమ కూడా సావిత్రి ఉన్నన్నాళ్లూ ఉంది తనివితీరక. ఉండడానికి వీలులేక పెద్దక్కలు మాత్రం వెళ్లిపోయారు. ఆనందరావుగారు మంచి రోజుచూసి సావిత్రిని అత్తింట్లో దిగబెట్టివచ్చారు.

ఆ రోజు రాత్రి సుబ్బారావు అన్నాడు సావిత్రితో.

"నువ్వు పుట్టింటికి వెళ్ళాక, మీ నాన్నగార్కి గొప్పా దక్కింది. నేనే చేతగానివాణ్ణనుకున్నారు తండ్రీ కూతురూ" అన్నాడు.

"అదేమిటి! మీకు చేతగానిదేముంది! చక్కగా డబ్బు మా నాన్న దగ్గర తీసుకున్నారు పట్టుబట్టి. ఇంక సైకిలు కొనుక్కుంటారు" అంది. "అప్పు వారి అప్పూ తీరింది అల్లుని మనసూ తీరింది" అందిట నీలాంటిదే ఒకావిడ. నువ్వు చేసినపని నాకు తెలియ

దనుకున్నావు? శ్యామలాంబగారి తమ్ముడు: మీ నాన్నగారిపేర మనియార్డరు చేస్తూంటే ఆ రోజే చూశాను.

నేను కాలేజీకి వెళ్ళగానే డబ్బు ఇచ్చావు మీ నాన్నగారిపేర మనియార్డరు చెయ్యమని అతనికి. అతను మర్నాడు ప్రొద్దున్న పోస్టాఫీసు దగ్గిర నన్ను చూసి "పిన్నిగారు ఇచ్చిన డబ్బు నిన్న వీలులేక ఇవాళ పంపుతున్నానండి. క్షమించాలి" అన్నాడు. నా కప్పుడే అర్థమైంది నీ ప్లాను. నేనూ తెలియనట్లే ఊరుకున్నా. ఎప్పటికి నువ్వు చెబుతావో చూద్దామనీ, బలే దానవు! ఇప్పటిదాకా ఇంకా అభినయిస్తున్నావూ?" చిరుకోపం అభినయిస్తూ అన్నాడు. "ఆ" అని తెప్పరిల్లి "మీ రెన్నాళ్ళనూ పంపకపోతే ఏంజెయ్యమన్నారు?" అంది వినయంగా. "డబ్బు నీ చేతులో ఉందిగా. నీ ఇష్టమొచ్చినట్లు చేశావు!" అన్నాడు. "నా ఇష్టం కాదండీ! ఆడదానికి పుట్టింటి ఆశ ఉండడం తప్పా!" అంది నేల చూపులతో. "నాకు అత్తింటి ఆశ ఉండడమే తప్పు. ఔనా!" అన్నాడు నవ్వుతూ.

"ఎవరిదీ తప్పుకాదు. మా నాన్న రిటైరై నాక వచ్చే డబ్బుతో మీ బాకీ తీరుస్తాడులెండి. ఆయన సర్వీసు ఇంక రెండేండ్లు. అంతవరకూ కాస్త ఓపిక పట్టండి" అంది.

"ఓపిక ఇప్పుడే పట్టాను. మరొకడైతే నువ్వు చేసిన పనికి ..."

"ఏం - ఒదిలేస్తారా?" అంది నవ్వుతూ. "ఏమో ఏంచేద్దునో కాని నువ్వంటే నాకు ... కోపంలేదుగా!". అని సావిత్రి పూర్తిచేసింది అతను చెప్పబోయే మాటను.

"రైట్. సరిగ్గా చెప్పావు?" అన్నాడు లాలనగా.

"ఫస్టుమార్కు వస్తుందా!" అంది. ఇద్దరూ నవ్వేరు. ఇద్దరి నవ్వులూ ఏకమై గదంతా వెన్నెల విరిసింది.



## మహాత్మాగాంధీ బోధనామృతం

మహాత్మాగాంధీ జీవిత విధానాన్ని గురించి ఆయన ప్రబోధించిన సూత్రాలను గురించి తెలియజెప్పడానికి ఢిల్లీలోని పాఠశాలా విద్యార్థుల ప్రయోజనం కేంద్ర విద్యా, వైజ్ఞానిక పరిశోధనల మంత్రిత్వశాఖ వరుసగా కొన్ని ప్రత్యేక ప్రసంగాలను ఏర్పాటుచేస్తోంది. ఈ కార్యక్రమం క్రింద ప్రసంగించవలసిందని కేంద్ర విద్యామంత్రిత్వశాఖ మహాత్మాగాంధి మనుమరాలైన కుమారి మణిబెన్ గాంధీని ఆహ్వానించింది.

ఈ కార్యక్రమాలలో మొదటి ప్రసంగం ఢిల్లీకరోల్ బాగ్‌లో రాయ్ కేదారనాధ్ బాలికా పాఠశాలలో ఏర్పాటు చేయబడింది.

కుమారి మణిబెన్ గాంధీ అక్కడ ప్రసంగిస్తూ మహాత్మాగాంధీ జీవితంలోని ప్రముఖఘట్టాలను గురించి వివరించారు. మహిళలలో చైతన్యం తీసుకురావడానికి మహాత్మాగాంధీ బోధనలు ఎలా దోహదం చేశాయో ఆమె చెప్పారు.

మహాత్మా గాంధీ భారత దేశానికి స్వాతంత్ర్యాన్ని సముపార్జించడమేగాక, ఆయన ప్రపంచానికి మానవతావాదాన్నీ, సత్యశీలాన్నీ, చిత్తశుద్ధినీ, ధైర్యాన్నీ బోధించారనీ యీ సందర్భంలో ప్రసంగిస్తూ భారత ప్రభుత్వ విద్యాశాఖ సలహాదారు, శ్రీ కె. జి. సయ్యిద్దీన్ పేర్కొన్నారు.

కేంద్ర విద్యామంత్రిత్వశాఖ మహాత్మాగాంధీని గురించీ, ఆయన సూత్రాలను గురించీ, యిలాంటి ప్రసంగాలను ఢిల్లీలోనేగాక, దేశంలోని ఇతరప్రాంతాలలోకూడా ఏర్పాటు చేయతలపెట్టింది.

# జర్మను కథలు - కబుర్లూ

'జర్మన్ డాక్టరు'

## ఎలుగు బంటి తోక!

ఒక రోజున ఎలుగుబంటి తనదగ్గరికి ఆదరా బాదరాగా నోట్లో పెద్ద చేపను కబళించుకుని వస్తూవున్న నక్కనుచూసింది. "నక్కా! నక్కా! ఎక్కడనుంచి దొంగిలించుకుని వచ్చావు అంత పెద్ద చేపను?" అని మందహాసం చేస్తూ ఎలుగుబంటి ప్రశ్నించింది.

"ఏమంటావూ?- దొంగిలించుకొని వచ్చాననేగా నువ్వు అనేది? అంత పని చేయటం మా ఇంటా వంటా లేదనే సంగతి నీకు తెలియదు కాబోలు! కష్టపడి పట్టుకున్నాను. నాకుమల్లె కష్టపడితే ఈ భాగ్యం అందరికీ లభించవచ్చు" అని అట్టహాసంతో అనేసింది.

ఎలుగుబంటికి చేపలంటే ప్రాణం. అంత పెద్ద చేపల్ని తనజన్మలో ఎప్పుడూ చూసిన పాపాన పోయింది కాదు. నక్క అలాటి చేపని దొంగిలించలేదట. కష్టపడి పట్టుకున్నదట. అలా పట్టుకోటం ఎలుగుబంటికి తెలియదు. అంచేత నక్కదగ్గర ఆ విద్యను యథాతథంగా నేర్చుకోవాలి. అలా చేయగలిగితే అలాటి చేపలని తండోపతండంగా పట్టుకొని తనివితీరా తింటూ ఆనందించవచ్చుని ఉబ్బితబ్బిబ్బు... ఉవ్విళ్ళూరుతూ సాగింది. అంచేత ప్రాధేయపడుతూ ఆ విద్యను తనకి నేర్పమని ఎలుగుబంటి నక్కను అడిగింది.

"అదంత బ్రహ్మవిద్యకాదు నేర్చుకోటానికి. నువ్వు అంత ప్రాధేయపడుతూ అడుగుతున్నావు కాబట్టి నీకు తప్పక నేర్పుతానులే. ఈ పనికోసం నీళ్ళలోకి వెళ్ళనక్కరలేదు. అదిగో ఆ పల్లాన్ని నిదానించి చూడు! మంచు గడ్డకట్టిపోయింది. దాన్లో చిన్న గోయిని తీసి తోకని ఇరికిస్తే చాలు. అలా ఇరికిస్తూ వుండటంలో తోకకి కొంచెం బాధకలుగుతూ వుండవచ్చు. అలానొప్పిగా వుండటం కొంచెంసేపే! అలా వోపికపట్టి లోపలికి ఇరికిస్తూ వుంటేవా, లోపల వున్న చేపలు తోకకి అంటుకుంటాయి. దాంతో నీ కోరిక అతిసులభంగా నెరవేరిపోతుంది!" అని సలహానిచ్చి నక్క తనదోవన గబగబ నడిచిపోయింది.

ఎలుగుబంటికి నక్క ఇచ్చిన సలహా బాగానచ్చింది. చరచర గడ్డ కట్టుకున్న పల్లంమీదికి నడిచి తనవాడి గోళ్ళతో లోతుపాటి రంధ్రాన్ని తొలిచి తనతోకను దాన్లోకి దూర్చింది. భరింపరానంత చలి. దాంతో తోకకి చెప్పరానంత బాధ. అయితేనేం వోపికపట్టి, ఆ బాధనంతా వోర్చుకుంటూ అక్కడే అస్తమానమూ

వుండి పోయింది. చీకటి పడటంచూసి ఇక తోకని బయటికి తీయటానికి ప్రయత్నించింది. తోక కన్నంలోనుంచి వస్తేగా! తన బలాన్నంతా వుపయోగించింది. తోక దానికి ఆగలేక చప్పున తెగిపోయింది.

అందుచేతనే ఎలుగుబంటి జాతికి ఆనాటి నుంచి తోకలులేవని జనం అనుకుంటారు.

## గుర్రపు దొంగ!

ఆ పట్టణంలో ఒక వకీలు వుండేవాడు. జడ్జీలముందర నోరు తెరచి మాట్లాడటానికి మొదలెట్టాడా — ఇక ఆయిన్ని ఆపటం బ్రహ్మాండం! ఒక జడ్జీకాదు కోర్టులో వున్న వాళ్ళంతా ఆయన వాదనను వింటూ ఆశ్చర్యపడుతూవుండేవాళ్లు. ఒక పల్లెటూరాయన వకీలు ఏదో కేసులో వాదించటం శాళ్లారచూసి ఆయిన్నే తన కేసులో పని చేయాటానికి ఏర్పాటుచేసుకున్నాడు. ఆ మనిషిని కేసులోనుంచి విడిపించటానికి శాయశక్తులా కృషి చేస్తానని వకీలు ఆ మనిషికి అభయమిచ్చాడు.

ఆ మనిషిమీద పెట్టబడ్డ కేసుఅతను ఎవళ్ళ గుర్రాన్నో దొంగిలించాడని! ముద్దాయి నిర్దోషియని ఋజువుపరచటానికి ఆరోజంతా వాదిస్తూ కోర్టువారిని స్తంభింపచేశాడు వకీలు. కోర్టువారూ వకీలు వాదననే అంగీకరిస్తూ ముద్దాయిమీద తేబడ్డ కేసు కొట్టివేశారు.

ఆ మనిషి ఈ కేసులోనుంచి బయటపడి ఇంటికి చేరుకున్నాక, "ఆ గొడవంతా మీకెందుకు? కాని అసలు నువ్వు గుర్రాన్ని దొంగిలించావా లేదా? ఆ సంగతి చెప్పు?" అని ప్రక్క ఇంటాయన అడిగాడు. అతనూ అదురూ బెదురూ లేకుండా "ఆపని చేశానని నాకు తెలుసు. కాని వకీలు వాదనని విన్నతరువాత అలా చేసింది నేనేనని నమ్మలేకుండా యున్నాను?" అని అన్నాడు

---

# జానపదగేయాలు

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావు

——(౦)——

ప్రేమికుల మనస్సులు కలిసినచోటే ప్రేమ వర్ధిల్లుతుంది. ఒకరు ప్రేమను జూపి, మరొకరు వ్యతిరేకించగా, అట్టి ప్రేమ వ్యర్థమైనదేగాక ప్రమాదకరమైనది కూడకావచ్చు. కాబట్టి అట్టిదానిని ఆదిలోనె తుంచివేయడం క్షేమం. ఈ క్రింది గేయాన్ని ప్రేమగేయమనాలో దవ్వ్యతిరేకగేయమనాలో తెలియదు. నీలగిరిరావు ప్రేమ కబురు పంపగా వలపులేని ఆ స్త్రీ తృణీకరించింది. ఆ కలాపం అంతటితో ముగియడం అదృష్టం. పురోభివృద్ధిలేని ఘటనగల ఈ జానపదగేయం చిన్నదిగా ఉండడం చాల సహజం. నీలగిరిరావు పంపిన దూతికకు, వయ్యారికి జరిగిన సంభాషణే ఈ గేయం.

"గట్టువెంబడి వెళ్ళేగి నీలగిరిరావు
నీలగిరిరావు నిన్నడిగినాడు"
"ఏమడిగినాడు? ఏలడిగినాడు?"
"రూపాయి ఇస్తానని రూపడిగినాడు
వరహా ఇస్తానని నన్నె అడిగినాడు"
"నన్నడిగిన రాజు మన్నదని చెప్పు
తల్లికి ఒక్కడే దక్కడని చెప్పు."

౨

విన్న గేయానికి వ్యతిరేకం ఇప్పుడు పాడబోయే గేయం. ప్రేమ విషయంలో స్త్రీ పురుషుల మనస్సులు ఒకే విధంగా ఉర్రూతలూగుతాయి. ఈ గేయంలో ప్రేమికి గోప్యతను విడిచిపెట్టి, తన కోరికలను వీరడిగా వెళ్లబోసుకొంటూంది. కాముకత్వం ఔచిత్యాన్ని ఎరగదు కదా.

నీ రూపు చక్కన నీవు చక్కన.
నిన్ను చూచినదాక నిలువదు మనసు.
నీ నడక నట్టింట నడచివెళ్లు రాజ!
పొగచుట్ట పొదిగిటనుంచి వెళ్లు రాజ!
కంచాన పెరుగన్నం కలిపివెళ్లురాజ!
అరచేయి అడ్డగోడ కాని వెళ్లురాజ!
దండాన తలగుడ్డ తగిలించు రాజ!
ఎడమకాలితోటి తన్ని వెళ్లు రాజ!

౩

జానపదగేయాలలో హాస్యముకూడ ఉంది. కాని ఉండవలసినంత అధికంగా లేదు. దీనికి కారణాలు లేకపోలేదు. పెద్దవారు ఎట్టివారయినా వారియెడ భక్తి శ్రద్ధలు చూపాలనీ, చిన్నవారిని ఏ ఏ శ్రమా నొప్పించకూడదనీ, మొదలైన భావాలవల్లనె హాస్యరసము అరుదయింది. కాని సహజమైన భావాన్ని పూర్తిగా అణచివేయడానికి ఎవరికీ సాధ్యంకాదు. సున్నితమైన భావాలు అంతగా చెంతచేరని జానపదులలో సహజమైన హాస్యరసం వారివలెనె మోటుగా ఉండక తప్పదు. అయినా అక్కడక్కడ సున్నితమైన హాస్యముకూడ లేకపోలేదు. ఈ కింది గేయం సున్నితమైన హాస్యానికి

నిదర్శనం. దీనిలో ఒక ముసలమ్మ తన ముసలి మొగుడితో హాస్యమాడుతూంది. ఈ గేయంలోని ఉపమానాలు హాస్యరసోత్పత్తికి తావులు. ఈ పాట ఒక దంపుళ్ల పాట. సువ్విసువ్వన్న అని ఊతపదం. పనిపాట్లకు ఈ హాస్యం ఎంతో తోడుపడుతుంది. పనిపాట్లలోని కష్టాన్ని, విసుగును పటాపంచలు చేస్తుంది.

సువ్వి సువ్వన్న సొగసుల మల్లన్న !
బంగారు బసవన్న ! ముసలమ్మ మొగుడా !
చింతచెట్టుమీద చిలుక వాలింది.
ముసలాడి నెత్తిమీద గద్దవాలింది. ||సువ్వి||
కొబ్బరిచెట్టుమీద కాకి వాలింది.
ముసలాడి బుర్రమీద కొంగ వాలింది. ||సువ్వి
కాకరచెట్టుకి కాయలందమ్మ.
మావారి ముక్కుకి పోగులందమ్మ. ||సువ్వి||
బెండచెట్టుకి ఆకులందమ్మ.
మావారి ముక్కుకి కాడలందమ్మ. ||సువ్వి||
మొగలి డొంకకి పువ్వులందమ్ము.
మావారి తలకాయకి టోపి అందమ్మ. ||సువ్వి||

## ౮

జానపదగేయాలలో చాల రకాలున్నాయి. కాని ప్రకృతి దృశ్యాలను వర్ణించేపాటలుకాని, జానపదులు చేసే పనిపాట్లను వర్ణించే పాటలుగాని చాల తక్కువ. తమ పనిపాట్లలోని సౌందర్యాన్ని కనిపెట్టకపోవడమె దీనికి ప్రధాన కారణం. ఈ క్రింది పాటలవంటివి చాల అరుదు. దీనిలో జొన్న చేని యొక్క పుట్టుక, పెరుగుదల, ముగింపు చక్కగా ముక్తసరిగా చెప్పబడినవి,

మఖ పుబ్బలతో జల్లేరు మా న్న ! నిన్ను
ఉత్తర హస్తలలో జల్ల గత్తవై పోవె ?
స్వాతి కార్తిలో జల్లగ జూచి
విశాఖలో నొక్క విసురు విసిరేను.
ఉండ్రాళ్ల తద్దికి ఉండ్రమంతుండి,
అట్లతద్దినాటికి అట్టంత పెరిగి,
చిత్తకార్తిలోను శృంగారించుకొని,
* మొదలు తన్నిన ఏడుగింజలు రాలు.

## ౯

కవికి తాను చేసే పనిపాట్లను గురించి గంభీరంగానో, హాస్యంగానో కళా రచనలను సృష్టించాలని ఉంటుంది. ఉపాధ్యాయ వృత్తిని చేబట్టిన కవికి ఉపాధ్యాయుడు అనః కళా కావ్యాన్ని రచించడం సహజం. జానపదకవులు తమ పనిపాట్లను గురించి తగినంతగా వ్రాయనిమాట వాస్తవమె. అట్టి పాటలు ఈరకం వాఙ్మయంలో చాల అరుదు. ఈక్రింది గేయంలో వ్యవసాయపు పనిని గురించి ఆలుమగళ్లు సంభాషించుకొంటారు. వ్యవసాయపు పని కత్తిమీద సామువంటిది. కొంచెం ఎక్కువయినా, తక్కువయినా కష్టమె, ఇల్లాలు వండిన వరి అన్నంలో లోపం వచ్చింది. దానికి కారణమేమని వారిద్దరు తర్జన భర్జనలు చేస్తారు.

---

* 'మొదలు తన్నిన ఏడుగింజలు ముదమునరాలు' అనే గేయంలో ఉంది. కాని అది అతిదీర్ఘమవడంవల్ల సంగ్రహం పరచవలసివచ్చింది.

"కూడు వండినావు కుందనపు చిలుక !
కూటిమీద చారలెందుకున్నాయి ?"
"వడ్లు పండించినవారు వల్లభులు తమరు.
వడ్లలో కేళీలు ఎందుకున్నాయి ?"

"సందె వేళ చాన ఆటకెళ్లినపుడు
సందె నీళ్లు గట్టు మరచితినె దేవి !
పొద్దోయి భోగింప నేవచ్చినపుడు
పొద్దు నీళ్ళు గట్టు మరచితినె దేవి !
ఓ తడి తక్కువాయె మరి కేళీలయ్యె."

## ౬

జంగమయ్య దీవన అను ఈ పెద్ద గేయంలో ముష్టికివచ్చిన జంగమయ్య మనసు దీవిస్తాడు. ముష్టి ఎత్తుకోడానికి తనకి అధికారముందని అతని ఉద్దేశం. ఈ దీవనలో అయ్యలను, అమ్మలను ఎంతగా పొగడాలో అంతగా పొగిడి ముష్టి పట్టుకుపోతాడు. పొగడ్తకి లొంగనివారిని తెగడి ముష్టివేయించుకోడానికి జంకడు. అమ్మలకి, అయ్యలకి, ఏ కోరికలు ప్రియమైనవో అతనికి తెలుసు. దీనిలోని సంతానాభివృద్ధి కోరిక ఇప్పటి ఉద్దేశాల ప్రకారం దేశ సంపదకు చుక్కెదురుకదా!

అమ్మ ! మీ లోగిలి ధర్మలోగిలి.
మీ ధర్మలోగిలి చల్లగుందండి.
కోటిగా మీ ఇల్లు కోరి దీవింతు.
బత్తితో మీ ఇల్లు పరవ దీవింతు.
చల్లగా మీ ఇళ్ళు భువన పందిళ్ళు.
చలవ పందిళ్లలో చాల పెళ్లిళ్ళు.
నిండుగల తల్లి ! నా తల్లిగారు !
భాగ్యవంతురాల ! అమ్మ సిరిదేవి !
సీతాదేవి వంటి తల్లివి అమ్మ !
ఆరువేల మీకు ఆవులేమంద.
ఏడువేల మీకు గోవులేమంద.
నిండుగల తల్లి గౌరమ్మ తల్లి !
ధర్మాత్ములండి మీరు ; దాగబోరండి.
పుణ్యులండి మీరు పూజతో దీవింతు.
పూజలు, పుణ్యాలు కలుగు మారాజ !
అమ్మ మీ లోగిలి పుణ్యాలోగిలి.
బత్తిగల తల్లి ఓ తల్లిగారు !
గౌరి పార్వతివంటి తల్లులు మీరు.
గవరమ్మ నోములు నోచినారమ్మ.
నీ నోము దండాలు ఫలమంద తల్లి !
పార్వతి ఇల్లాల గుణవంతురాల !
కడుపున ఈ తూరి కొడుకుపుట్టునమ్మ !
కొడుకు తండ్రిపై కోరియుండవయ్య !
ఉగ్గుతాగిన బాల ఊసులాడును.
మనుమల నెత్తేవు మారాజ ! నీవు.
పాలుతాగిన బాల పాకులాడునమ్మ !
సత్యవాదిని తండ్రి ! చల్లని తండ్రి !
తొట్టిలోని బాల తుళ్లాడునమ్మ !
చల్లగా నీ కడుపు చాల వర్ధిల్లు.
చంకలో నీ బాల శంభునాధుండు.
సకల సంబరాల దేవిడవాలి.
దేవిడీ మెచ్చాలి దేవలోకాలు.
మనుమల నెత్తేవ మాయకురాల !
నాగేంద్రుడు డివ్వాలి నాగలోకాన.
సత్యవాదివి తల్లి ! చల్లనితల్లి !
శివుడు మెచ్చివ్వాలి చిన్న బాలలను.
కవిపెంచు ఇల్లాల కడుపు దీవింతు.
దీవించినానమ్మ ! దీవన బాలలకు.
భాగ్యముతో మీ ఇల్లు దివ్యమారాజ !
కోటిగా మీ ఇల్లు దీవింతుతల్లి !
సకల సంబరాలు స్వామి మెచ్చాలి.
నిండైన తండ్రులు మీరు మారాజ !
బత్తిగల తండ్రి ! బాలల తండ్రి !
ఏడికొడ్లు కలుగు ఎలమందలోను.
ఎలమంద మీ ఇళ్ళు హెచ్చి వర్ధిల్లు.
వృద్ధిగా నీ రేఖ వృద్ధి బొందాలి.

జాము జాములయ్యె జాగరాలయ్యె.
నిండు జాగరాలు కలవు మా రాజ!
బత్తితో మీ ఇళ్ళు పరమ దీవింతు.
నిలబెట్టురాదమ్మ! నిండు గుమ్మములో.

నిలబెడితె పుణ్యాలు నీదకేగావు.
అమ్మ! నీ లోగిలి భాగ్యలోగిలి.
భాగ్యవంతురాల! అమ్మ సిరిదేవి!
దొరగారి కచ్చేరి ధర్మకచ్చేరి.
మీ ధర్మ కచ్చేరి చల్లగుండాలి.

రావయ్య మా రాజ! ఓ ధర్మ తండ్రీ!
ఒక దిక్కు చుంటేను కడుపు ండదు.
పదిళ్ళ కెళ్ళితేను పదిగుప్పిళ్ళు.
చిట్టి కొడుకుల తల్లి! చిన్న గవరమ్మ!
దీవెన గలుగు, దీవెన బాణముగల్గు.

పిల్ల పాపలు పుట్టు నీకు గవరమ్మ!
పట్టెడు కుంకమ్మ పరమ మా తల్లి!
చుక్కలకు తోడమ్మ నీ చుక్కబొట్టు.
రావయ్య నాయనా! ఓ ధర్మ తండ్రి!
మధ్యాహ్నం వచ్చేడు మాయ జంగమ్మ.

అమ్మ! బిచ్చమని అడగవచ్చేడు.
బిచ్చము లేదయ్య వెళ్ళిపో అనకు.
వడ్లయిన లేకపోతె బియ్యమైన పెట్టు.
చెరిగి చెరిగి ఇంత పొల్లు పెట్టింది.
తోడి తోడి తల్లి ఇసక పెట్టింది.

చింతచెట్టుమీద శివుడు కూర్చుండె.
ఎప్పుడు చెప్పేడో మాయజంగమ్మ!
కుళ్ళు రోగముతోటి కుళ్ళుతుంటారు.
వజ్రదొండ పురుగులతో వేగుతుంటారు.

# శ్రీ రా మ క ర్ణా మృ త ము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౬౧

తారాగ్రహాక్రాంత – ధవళశృంగ నితాంత
దివ్యోన్నతంబైన – నవ్యసౌధ
మొందు, విరాజిల్లు ; నిండు పున్నమ కోటి
చంద్రకాంతులచేఁ బ్రశస్తమైన
సౌధాంతరంబున – సరసిజంబున నీవు
సుఖముగాఁ గూర్చుండి సుందరాంగ !
వాల్మీకి దుర్వాస - వరమునిశ్రేష్ఠులు
సేవింపగా నిన్ను – శ్రీశుభాంగి

సీత, యెడమ ప్రక్కఁ జెలువారు చుండంగ
వెలయుచుండు నీవు వేదవేద్య !
రామచంద్ర ! నిన్ను శక్తితోఁ బ్రార్థింతు
మంచి బుద్ధి నొసఁగి – మనుపవయ్య !

౬౨

శ్రీ పురాణ పురుష ! సీతామనోహరా !
వందనంబులు నీకు సుందరాంగ !
ఇంద్ర నీలశ్యామ ! ఇనకుల భూషణా !
వందనంబులు నీకు వనరుహాక్ష !
హారకిరీటంబుఁ జారు కుండలములు
ధరియించు రామ ! వందనము నీకు !
దశరథాత్మజ ! జగదాధార ! గుణవర !
కైమోడ్పులర్పింతుఁ గమలనాభ !

ధనువు బాణంబుఁ బట్టి, కోదండరామ !
సర్వ జగముల రక్షించు సార్వభౌమ !
పాపములఁ ద్రోలు శ్రీరామ ! భవ్యనామ !
వందనంబులు నీకు ! శ్రీ సుందరాంగ !

౬౩

శౌనకాదిమునుల, సంస్తోత్రములఁ జెందు
శుభగుణభూషణా ! స్తుతులొనర్తు
తారకపీఠమధ్య నిలయుఁడవై, జగ
న్నాయకుఁడగు రామ ! నతులొనర్తు
భక్తులకెల్లఁ గల్పకమవై, కోదండ
ధారియౌ రామ ! వందన మొనర్తు
నీలమేఘశ్యామ ! నిగమ గోచరరామ !
శ్రీకర ! నీకు జేజేలొనర్తు

నార్య ! "తత్త్వమసీతి" వాక్యజనకుండ
వై, సదా భక్తులను బ్రోచు యబ్జనేత్ర !
సతము సద్భక్తిధ్యానించి, సంస్తుతించి
మ్రొక్కులిడియెద; శ్రీరామ ! ముక్తినిమ్ము.

౬౪

రాఘవేంద్రుఁడ ! సహస్రారపద్మము నందు
వసియించి యున్నావు ! వందనములు !
ముక్కంటికిష్టుఁడవై – రక్కసులను ద్రుంచి
బహుకీర్తిఁ గొన్నావు వందనములు !

అమృతమువలెఁ జల్లనైనావు; దేవతల్
వానరుల్ స్తుతియింత్రు – వందన
ములు!
చంద్ర సూర్యులు నీకుఁజక్షుయుగ్మంబులు
భద్రగుణోన్నత వందనములు!
శ్రీ జగత్పావనుండవై చెలఁగినావు!
పావనికి నీవు నిండు దీవనలొసంగి
ప్రోచి నాఁడవు; శ్రీరామ! పుణ్యపురుష!
వందనంబులు; సచ్చిదానందమూర్తి!

౬౫

సంద్ర గర్వంబును సమయఁజేసితి వీవు!
వందనంబులు నీకు సుందరాంగ!
కౌశికయాగ రక్షణము జేసితివీవు!
వందన శతము ముకుంద! వరద!
శ్రీ ధనుర్బాణముల్. జేధరించితి వీవు!
వందనములు రామభద్ర నీకు!
నారచీరలు జడల్ - నయమునఁదాల్చితి
వందంబుగా, రామ! వందనములు;
సీతయును లక్ష్మణుండు నీసేవసలుప
దండకారణ్య భూమి నుద్దండ గతినిఁ
దిరిగి నాఁడవు! గురువుల గురువు నీవ!
వందనంబులు; శ్రీపతీ! సుందరాంగ!

౬౬

తెల్ల దామరల, సంపుల్ల నేత్రములతోఁ
బూర్ణచంద్రునివంటి మోముతోడఁ
గంబు గళముతోడఁ గమల హస్తములతోఁ
బరఁగెడి శ్రీరామ! వందనములు!
పీతాంబరము గట్టి - సీతారమామణి
సేవింప ముగ్ధుఁడౌ శ్రీనివాస!
కారణదేహ! జగన్మోహనాకార!
భద్రాద్రి రాఘవా! వందనములు!
ఉజ్జ్వల లలాట భాగంబు నొప్పువాఁడ!
ఆర్య! శ్రీరామభద్ర! దయాసముద్ర!
అంబుదాకార! రాఘవా! అభయమిమ్ము
వందనంబులు, శ్రీపతీ! సుందరాంగ!

౬౭

సూర్యకులాబ్ధిఁ గౌస్తుభ మణివై వెల్గు
భద్రాద్రిరామ! తుభ్యం నమోస్తు
నీలోత్పలశ్యామ! నిఖిల మహాపాప
పంచకహరణ తుభ్యంనమోస్తు!
తలంప, షడ్వింశతి – తత్త్వభాసితుఁడవై
పరగెడి రామ! తుభ్యం నమోస్తు!
త్రిజగంబు, నిను సంస్తుతింపంగ వెలిఁగెడి
ప్రహ్లాద వరద! తుభ్యం నమోస్తు!
అభయ మొసఁగెడి దేవ! తుభ్యంనమోస్తు!
అవనిజాపతి! రామ! తుభ్యంనమోస్తు!
అఖిల సురముని వినుత! తుభ్యంనమోస్తు!
భవ్య సుగుణసమేత! తుభ్యంనమోస్తు!

(సశేషము)

—:o:—

# అభాగ్యురాలు

శ్రీమతి దొంతంశెట్టి మల్లేశ్వరీదేవి



గడియారం పన్నెండు గంటలు కొట్టింది. అంతా నిశ్శబ్దంగావుంది. మా యిరుగుపొరుగు ప్రజలంతా మంచి నిద్రలో వున్నారు. కాని, నాకవాళ అప్పటి వరకూ నిద్రరాలేదు. గదిలో లైటు పెద్ద వెలుతురుతో వెలుగుతూనేవుంది. గదిలో టేబిలు ముందు కుర్చీలో కూర్చొని అప్పటివరకూ యేదో పుస్తకం చదువుతూనే వున్నాను. గడియారంచూచి అప్పటికి చాలా రాత్రయిందని గుర్తించాను. అప్పటికీగూడా యిక నిద్రరాకపోవడంతో యిక బలవంతంగానైనా నిద్రపోవాలని పుస్తకంమూసి, లైటు ఆర్పి మంచం మీద పడుకొన్నాను. కళ్లుమూసుకొని యెంత ప్రయత్నించినా, నిద్రమాత్రం పట్టలేదు. అంత బలవంతంగా నిద్ర తెచ్చుకొని పడివుండటం నాకు యేమాత్రంకూడా యిష్టంలేదు. అందుకని లేచి లైటు వేసి, కుర్చీలో కూర్చున్నాను. అప్పటికే ఒంటి గంటయింది. ఏదయినా కథ వ్రాద్దామని కలం, పుస్తకంతీసి, వ్రాయడానికుపక్రమించాను. కాని, యేం వ్రాయాలో, యెటువంటి కథ వ్రాయాలో ఆలోచించేందుకే నా మెదడు నాతో సహకరించలేదు. దానితో కలం టేబిలుమీదే పెట్టి, కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చున్నాను. ఆ వేళ పౌర్ణమనే విషయం నాకప్పుడే తెలిసింది. తెల్లని వెన్నెలతో వీధంతా పిండారబోసినట్టుగా వుంది. వెన్నెల అంటే నా కెంతో సంతోషం. వెన్నెలను చూస్తూంటే యెందుకో నా కెంతో ఆనందంకలుగుతుంది. యిక ఆకలి, నిద్రల మాటే మరచిపోతాను.

యిక ఒక్క క్షణంగూడా గదిలో వుండలేక పోయాను. తలుపు తాళంవేసి వీధిలోనికి బయలు దేరాను. ఎక్కడకు, యెందుకు వెళ్ళాలో నాకే తెలియదు. ఆ పంట వెన్నెలలో యేమీ ఆలోచన లేకుండానే పిచ్చిదానిలా చాలా దూరం వచ్చేసాను. అలా ఎంతో దూరం నడిచాక నాకు స్పృహవచ్చినట్టయింది. అప్పటికప్పుడే వూరిచివర స్మశానం వరకూ వచ్చేశాను. నాకు స్మశానం అంటేనూ, దయ్యాలు అంటేనూ యేకోంచెమో భయంవుంటే అది నా చిన్నప్పుడేపోయింది. అప్పటికి చాలా దూరం నడిచానేమో, కాళ్ళుకూడా లాగుతున్నాయి. అందుకని స్మశానంలోనే ఒక సమాధిమీద కూర్చున్నాను.

అలా పదినిమిషాలు కూర్చొని వుండేటప్పటికి, ఆ నిశ్శబ్దంలో చిన్న ధ్వని బయలుదేరింది. అప్పుడు నాకే మాత్రం భయం వేయలేదుగాని, ఎంతో ఆశ్చర్యం ఆతృతా కలిగాయి. ధ్వని యెటునుండి వస్తూందో అని చెవులు నిక్కించి చూస్తూన్నాను. అమాంతంగా నేను కూర్చొనివున్న సమాధి కదిలినట్లయింది. మరుక్షణంలోనే ఒక 'నీడ' నా యెదురుగుండావచ్చి నిలబడింది. "ఎవరు నువ్వు?" అని నేను అడిగేముందే ఆ 'నీడే' నన్ను ప్రశ్నించింది. మొదట ఆ 'నీడ'ను చూస్తూ నేనంత ఖచ్చితంగా నిర్ధారణచేసుకోలేకపోయినా, ఆ కంఠ ధ్వనినిబట్టి వెంటనే తెలిసిపోయింది. అదొక స్త్రీ 'నీడ' అని, వయస్సు పాతికకు మించివుండదనీ, ఆ కంఠ స్వరాన్నిబట్టి పోల్చుకున్నాను.

నేను వెంటనే యేమీ సమాధానం చెప్పకపోవడంతో మళ్ళా ప్రశ్నించింది. ఈ సారి ఆ కంఠంలో మొదట వున్నంత కఠినత్వమూ, బిగ్గరధ్వనీ లేకపోయినా సూటిగా మాత్రం ప్రశ్నించింది.

"నేనొక రచయిత్రిని. పత్రికలకు కథలు వ్రాస్తూంటాను" అని సమాధానం చెప్పాను. "రచయిత్రి" అనేమాట వినగానే ఆ 'నీడ' ముఖంలో కొంచెం

మందహాసం కనుపించింది. ఎంతో చనువు వున్న దానిలా నా ప్రక్కకువచ్చి కూర్చుంది. ఆ సమయంలో మరో మానవమాత్రు డెవరయినా అయితే ఎంతో భయపడివుండేవాడేమోగాని, నాకు మాత్రం యేమీ భయంలేకపోయింది. 'భయం' అనే వస్తువు నాలో యేకొంచెమేనావుంటే అది నా చిన్నప్పుడే పోయిందని ముందే చెప్పానుగా? ఆమెను గురించి, ఆమె జీవితం గురించి తెలుసుకోవాలని నాకా క్షణంలో ఎంతో ఆత్రుత జనించింది. అందుకని ఆమె ముఖంలోకి చూస్తూ సూటిగా ప్రశ్నించాను.

"ఎవరు నువ్వు?"

నా ప్రశ్నకా 'నీడ' ప్రశాంతంగా నా వైపు చూస్తూ "చెల్లీ! నేనెవర్నో తెలుసుకోవడంవల్ల నీకు కలిగే లాభంయేంటి? నేనూ నీలాగే ఒక 'వనిత'ను. కాని, నీలా నేను రచయిత్రిని మాత్రం కాదు. నాకు నీలా శరీరంలేదు. నీవలె మానవుల్లో మళ్ళా కలువలేను." అంది కొంచెం విచారంతో కూడిన కంఠస్వరంతో. ఈ మాటలు విన్నాక, ఆమె చరిత్రయేమిటో తెలుసుకోవాలనే వుత్సాహం నాలో మరీ యెక్కువయింది.

"నేనేం మగవాడినికాదుగదా? నీ చరిత్రంతా నాతో చెప్పడానికెందుకు సంకోచిస్తావ్? ... ... పోనీ, నీ కంత కష్టంగావుంటే."

నేను మాట పూర్తిచేయకుండానే అంతా గ్రహించి మధ్యలోనే అందుకొంది. "నీవే మగవాడవయివుంటే యింతసేపూ యీ సమాధిపై కూర్చోనిస్తానా చెల్లీ! పవిత్రమయిన నా సమాధిని వారి పాపపు చేతులతో తాకనిస్తానా? ... ... ... నా చరిత్రంతా వినడంవల్ల నీకే మాత్రం సంతోషంగాని; ఆనందంగాని దొరకదు. తుదినుంచి మొదటివరకూ నా దొక హృదయ విదారకమయిన దీన చరిత్ర. వినాలని నీ కంతగా కుతూహలంగావుంటే చెప్తా విను! కాని నీకు యిందువల్ల విచారంతప్ప, మరేం దొరకదు విను!"

"ఈ పాపపు ప్రపంచములో ఆడదిగా జన్మించడమే మహాపాపం. అందులోనూ పంచమహాపాతకాలూ చేసుకొంటేనేగాని భూమిమీద జన్మించగానే తల్లిని కోల్పోరు.

సరిగ్గా నా బ్రతుకిలాగే జరిగింది. నేను పుట్టిన మూడు రోజులకే మా అమ్మ ప్రసూతి రోగంచేత చనిపోయింది. మా నాన్నకు అమ్మమీదవుండే ప్రేమ కొద్దీ ఎంతో కృసించిపోయాడు. అతడు భార్యను యెంతగా ప్రేమించాడంటే అది చెప్పడం మహా కష్టం. ఒక్క క్షణం ఆమెను చూడలేకపోతే వుండలేకపోయేవాడట. భార్యపోయిన విచారంతో కొంతకాలం దుఃఖించిన తరువాత మా నాన్న సరిగ్గా మా అమ్మ పోలికలోనే వున్న నన్ను చూచి తన విచారాన్ని కొంచెం కొంచెం మరచిపోయేవాడు. నన్నెంతో గారాంతో చూచేవాడు. నేను కోరే యేవస్తువయినా సరే, మరుక్షణంలో నా చేతిలో పడితీరాల్సిందే. అంత అల్లారు ముద్దుగా ఐదేండ్లప్రాయం వరకు పెరిగాను.

అప్పటినుండే నా జీవితంలో దుర్దినాలు ప్రారంభించాయి. క్రమక్రమంగా మా నాన్న, మా అమ్మను మర్చిపోయాడు. దానితో మా నాన్నకు నాయందుగల ప్రేమగూడా కొంచెం కొంచెం సన్నగిల్లసాగింది. అదే సమయమని మా చుట్టాలు పక్కాలు అంతా ఎన్నోవిధాలచెప్పి మా నాన్నకు మళ్ళా పెళ్ళికి నిశ్చయించారు. యధావిధిగా పెళ్ళి జరిగిపోయింది. అలా జరగడంవల్ల మా నాన్న చాలా సుఖించాడేమోగాని, నేను మాత్రం పూర్తిగా దుఃఖ సముద్రంలో మునిగిపోయాను.

ఆమె హృదయం యెటువంటిదయినప్పటికీ ఆమె మాత్రం మంచి అందగత్తె అని చెప్పడంలో యే మాత్రం అతిశయోక్తివుండదు. మంచి తెలివయినది. గొప్ప చమత్కారిగూడా. మా నాన్న ఆమె సౌందర్యాన్ని చూచి పెళ్ళయిన మరుక్షణమే ఆమెకు దాసుడయిపోయాడు. పెత్తనం అంతా ఆమె చేతిమీదుగానే జరిగేది. ఆమె చెప్పిందే వేదాక్షరం. ఆమె

మాటకు అడ్డులేదు. ఎటువంటి పనయినప్పటికీ తక్షణం జరిగితీరాల్సిందే. అందుకని మా నాన్న గూడా యేమీసంకోచించేవాడుగాదు.

ఈ విధంగా రోజులు, నెలలు సంవత్సరాలు గడచిపోతూన్నెయ్. నేను కొంచెం పెద్దదానయ్యాను. అప్పటికి మా నాన్నకు ఒక మగపిల్లవాడుకూడా కలిగాడు. ఇక యింట్లో చాకిరీ అంతా నా మీద పడింది. మా సవత్తల్లి అంతకుముందు యింట్లో వుండే దాసీదాన్నిగూడా మాన్పించేసింది. ప్రొద్దుటే యింకా కాకులు లేవకుండా లేవాలి. వీధివాకలీ, దొడ్డివాకలీ తుడిచి కళ్లాపు జల్లాలి. ఆ తరువాత యిల్లంతా నేనే వూడ్చాలి. అదయిన తరువాత వంట గదిలోనికిపోవాలి. యెనిమిది గంటలయ్యేటప్పటి కల్లా యేదో ఒక ఫలహారం, కాఫీ తయారుచేయాలి. మళ్ళా వెంటనే మధ్యాహ్నం భోజనాలకు వంట ప్రారంభించి పన్నెండు కాకుండా రెండు కూరలూ, నాలుగు పచ్చళ్ళు మరో వేపుడుతోసహా తయారు చేయాలి. అందరి భోజనాలూ అయ్యేటప్పటికి మధ్యాహ్నం రెండుగంటలయ్యేది. అప్పుడు అంతా తినగా మిగిలిన వేవయినావుంటే తినేదాన్ని. ప్రొద్దుటనుండీ ఒక్క నిముషంగూడా విశ్రాంతి లేక పోగా, మధ్యాహ్నం కొంచెంసేపు నడుంవాల్చడానికి గూడా తీరికవుండేదిగాదు. మళ్లా మూడు గంటలకు కాఫీలు తయారు చేయాలి. ఆ తరువాత సాయంత్రం వంట చీకటిపడకుండా తయారు కావాలి. భోజనా లయ్యాక అన్నీ సర్దుకొని పడుకొనేటప్పటికి రాత్రి పదకొండయ్యేది.

ఈ విధంగా ప్రతి రోజూ వూపిరితీసుకోడానికి గూడా తీరికలేకుండా చాకిరీచేస్తూన్నా ఒక్క మెప్పూ, ముద్దూ యేమీలేదుగదా. కాఫీ కొంచెం ఆలశ్యం అయినా, భోజనంలో రకాలు తక్కు వయినా చీవాట్లేకాకుండా తన్నులుగూడా తగి లేవి. "పోతులా వున్నావు. చేయలేవా? పంది ముండా!" అంటూ యింకా బండతిట్లన్నీ తిడుతూ మా సవత్తల్లి చావగొట్టేది. నోరువిప్పి యెదురు చెప్పడానికి వీలులేదు. నన్నుచూచి మా నాన్న గూడా మరేం మాట్లాడేవాడుగాదు. యిక ఆ యింట్లో మా సవత్తల్లి మాటకు అడ్డులేదు.

ఈ విధంగా కాల ప్రవాహం నడచిపోతూనే వుంది. నాకు ఒక్కొక్క సంవత్సరమే వయస్సు పెరుగుతూంది. ఎంత బండచాకిరీ చేస్తూన్నా, యెన్ని దెబ్బలు తింటూన్నా నాకు పదిహేనవ సంవత్సరం వచ్చేటప్పటికల్లా నిండు యవ్వనం వచ్చికూర్చుంది.

నా చిన్నప్పుడు మా నాన్న నాకు మంచి సంబంధం చూస్తానని కబుర్లు చెప్పేవాడు. ఆ విధం గానే తన మాట ప్రకారం మా నాన్న సంబంధం కుదిర్చి యింటికొచ్చాడు. పెండ్లికొడుకు బి. ఏ. పాసయ్యాడట. మంచి బుద్ధిమంతుడట. సంబంధం మంచిదని అందరూ అన్నారు. కాని దేవుడు నా నొసట ఒకలారాస్తే మరోలా యెలా జరుగుతుంది! మా సవత్తల్లి "ససేమిరా" అంది. నన్ను తన తమ్ముడికితప్ప మరెవ్వరికీ చేయడానికి వీలులేదంది.

యిక ఆ యింట్లో ఆమె మాటకు అడ్డుచెప్పగలిగే వారెవరు? ఆమె కోర్కె ప్రకారమే జరిగిపోయింది.

అలా జరిగినందుకు నేను యే మాత్రం విచారించ లేదుగూడా. ఆ సమయంలో నాకు భర్తను గురించి గాని, ప్రేమ గురించిగాని అంత యెక్కువగా తెలి యదు. అపుడు నాకు కావలసింది పెళ్ళే. ఎందు కంటే ఆ బండచాకిరీ, తిట్లూ, దెబ్బలూ తప్పి మరో యింటికిపోవచ్చు. యెంత నరకమయినప్పటికీ యీ బానిస జీవితం అంత కష్టంగా వుండదనేవిషయం అపుడు నాకు బాగాతెలుసు.

ప్రపంచములో అందరు స్త్రీలు, తమ భర్తలను గురించి యేవిధంగా తలుస్తారో, నేనుగూడా అలాగే తలిచాను మొదటిసారిగా అత్తవారింటికివచ్చేటప్పుడు దీర్ఘ కాలం ఖైదుజీవితం అనుభవించిన తరువాత విడుదలై ప్రపంచములోనికివచ్చే ఖైదీలాగ ఎంతో సంతోషించాను. వెళ్ళిన ఒక నెలవరకూ చాలాకులా సాగావున్నాను. మావారపుడు నన్నెంతో ప్రేమించే వారనుకొనేదాన్ని. ఎలాఅయినప్పటికీ ఆ నెల

రోజులూ నేను స్వర్గంలో విహరించానంటే నమ్మ చెల్లీ! కానీ మబ్బులన్నీ చంద్రుణ్ణి మూసేసి నట్టుగా నా ఆనందజీవిత ద్వారాలన్నీ వాటికవే మూసుకపోయినవి. అప్పటినుండి నా జీవితచక్రం మామూలు కష్టాలబాటలో నే పడిపోయింది.

మా వారు యింటిలో ఒక్క క్షణం వుండేవారు గాదు. భోజనానికి మాత్రం వచ్చేవారు. మళ్ళా వెంటనే వెళ్ళిపోయేవారు. రాను రాను రాత్రిళ్ళు గూడా యింటికి రావడం మానేశారు. నాతో అసలే మాట్లాడేవారుగారు. మా వారిలో అకస్మాత్తుగా కలిగిన యీ మార్పు చూస్తూంటే నాకు మొట్టమొదట యెంతో ఆశ్చర్యం వేసింది. కొన్ని రోజులు గడిచే టప్పటికి అసలు విషయం అంతా తెలిసింది. వారికి అంతకుముందే 'వుంపుడు కత్తె' ఒకతె వుందట. సానివాళ్ళయిళ్ళు మరిగిన మగవారి ప్రవర్తన గురించి వేరే చెప్పాలా చెల్లీ! రోజులు గడిచేకొద్దీ వారి ప్రవర్తన మరీ విపరీతం అయిపోయింది. ప్రపంచములోవుండే సకలమైన దురలవాట్లూ వారిని చుట్టు ముట్టాయి. ఒక్కొక్క రోజున వారు బాగా త్రాగి వళ్ళు తెలియకుండా యింటికి వచ్చేవారు. నన్ను గదిలో పెట్టి గొడ్డును కొట్టినట్టుగా కొట్టేసేవారు. ఆ తరువాత నాదగ్గరవున్న వస్తువులు తీసుకొని వెళ్ళి పోయేవారు.

ఎంత దుర్మార్గులయినా అగ్నిసాక్షిగా పెండ్లా డిన భర్త హిందూ ధర్మశాస్త్ర ప్రకారం భార్యకు సాక్షాత్ భగవంతుడేగదూ? ఎన్నడూ వారిని పల్లెత్తుమాట అనలేదు.

ప్రపంచములో అందరి గురించి నాకంతగా తెలి యదుగాని నాకు తెలిసినంతవరకూ మా వారివంటి అనుమానపు మనిషిని నేనుయెక్కడా చూడలేదు. ఈ విషయంగూడా నేను ఆఖరు గడియలలో నే తెలుసుకొన్నాను.

ఆ నాడు మా నాన్నగారి దగ్గరనుండి ఒక నౌఖరు వచ్చాడు. ఆ సాయంత్రం దీపాలు పెట్టిన తరువాత ఆ నౌఖరును నా గదిలోనికి పిలచి మాట్లాడు తున్నాను. ఆ నౌఖరు చాలా మంచివాడు. ఎంతో కాలంనుండి మా నాన్న దగ్గర వుంటూన్నవాడు. అందుకనే యింటి దగ్గర అన్ని విషయాలు అడుగు తున్నాను. అదే సమయంలో మా వారు బాగా త్రాగి తూలుతూ గదిలో ప్రవేశించారు. రాగానే గదిలోవున్న నౌఖరును నన్ను ఒక్కసారి చూశారు. ... ... ... అంతకంటె నేను చెప్పలేను చెల్లీ! ... గొడ్డును కొట్టినంతకంటే యెక్కువగా కొట్టేశారు... స్పృహతప్పి పడిపోయాను ... అన్నీ తీసుకొనిపోగా మిగిలిన మంగళసూత్రం తెంపుకొని బయటగొళ్ళెంపెట్టి వెళ్ళిపోయారు ... ...

ఆ మర్నాడు ప్రొద్దుటే నాకీ సమాధి చేయ బడింది. అంతా విన్నాక నేను నిశ్చేష్టురాలనై ఆ నీడవంకచూస్తూ అలాగే వుండిపోయాను. ఆ 'నీడ' ప్రశాంతంగా నిలబడి "చెల్లీ! యింత జరిగినా నాకేమీ అంత దుఃఖంలేదు. అంతా నా ఖర్మ. ... కాని ఆఖరు ఘడియలలో వారి హృదయం లోనే నొక 'కులట'గా పాతుకపోయినందుకు కుమిలి, కుమిలి యేడుస్తున్నాను" అంటూ విచారంతో అక్కడ నుండి కదలిపోయింది.

విచారంతో నేనొక వేడినిట్టూర్పు విడచి యింటికి బయలుదేరాను.

—X—





## కోసుమిరి

మొదలు కూరగాయలను తెచ్చి శుభ్రపరచి వుంచుకోవాలి. యేవేవి అనగా, టొమాటో 1. (సీమవంగ) కేరట్ 1, (ఎఱ్ఱముళ్ళంగి) ఎఱ్ఱగడ్డలు 4, దోసకాయ 1, బీటుదుంప 1, పచ్చి మిరపకాయలు 10. కొత్తిమీరాకు కొంచెము, పచ్చికొబ్బరికోరు పిడికెడు. నిమ్మపండు 1, పిడికెడు సెనగపప్పు, పిడికెడు పెసలపప్పు, నీళ్ళలో నాననిచ్చి తీసివుంచుకొనవలె. పైన చెప్పిన పచ్చిమిరప కూర గాయల వగైరాలను సన్నగా తరిగి తగినంత పాత్రలో వేసుకొనుము. తర్వాత కొబ్బరకోరు, నాననపప్పులు, నిమ్మపండురసము వేసి బాగుగా కలిపి 2 చంచాల ఆవాలతో పోపుపెట్టి వుపయోగించుము. వలయు వారు ఐస్ వేసుకొనవచ్చును. మామిడి పిందెలుకూడా సన్నగా తరిగి వేసుకొనవచ్చును. ఇది ఎండపొద్దులో తినుటకు ఎంతో బాగుండును. తగినంత పొడిచేసిన వుప్పు తినుటకు ముందుగా కలిపి వుపయోగింపుము.

## మెంతి ఆకు కూర

మెంతి ఆకు $\frac{1}{2}$ చాటడు తెచ్చి శుభ్రపరచి, సన్నగా తరిగి తగినంత నీళ్ళలో వుడికించి వడవేయవలెను. ఒక ఆళాకు సెనగపప్పునీళ్ళలో నాననిచ్చి, పచ్చికొబ్బరి ఒకటి కోరితీసుకొని, పట్టెడు ఎండు మిరపకాయలు కాస్త ఇంగువ, వుప్పు అన్నీకలయిరుబ్బి, వడవేసిన మెంతిఆకుతోకలిపి వుంచుకొనుము. తర్వాత $2\frac{1}{2}$ పలం మంచినూనె బాణలిలో వేసి చంచా ఆవాలు చంచాడు వుద్దిపప్పు, అందులో వేయవలెను. వేగిన తర్వాత వుంచుకొన్న మెంతిఆకువేసి, బాగాగరిటతో కలుపుతూ వుండవలయును. కొంత సేపు వాడిన తర్వాత ఒక నిమ్మపండు రసముతీసి కూరలో వేసి బాగా కలిపి వుపయోగింపుము. ఇది చాలా రుచికరముగావుండును.

## బీటుదుంప బరిపి

బీటుదుంప $\frac{1}{4}$ వీశ. పంచదార $\frac{1}{2}$ వీశ. కాస్త ఏలకపొడి, కాస్త కేసరి పొడి, $2\frac{1}{2}$ పలం నెయ్యి తీసివుంచుకొనుము. తర్వాత బీటుదుంపలను శుభ్రముగాకడిగి కొబ్బరితురుముతో తురిమి తెల్లనిశుభ్రమైన వస్త్రమునందు ఆరవేయుము. కొంతసేపు ఆరినతర్వాత పొయ్యిమీద బాణలివేసి నెయ్యితోవాడ్చి తీసుకొనుము. తగినంత పాత్రలో అర్ధ ఆళాకు నీళ్ళుపోసి వుంచుకొన్న పంచదార వేసి కరిగిన తర్వాత బీటుకోరును వేసి కలుపుతూ వుండవలయును. నిప్పుసెగ సన్నగా వుండవలయును. పాకము గట్టిపడిన వెనక ఏలకపొడి, కేసరి పొడి, కాస్తపచ్చకర్పూరము వేసి పళ్లెములో పోసి. కొంతసేపు ఆరినతర్వాత కత్తి లేక జల్లి గరిటతో చౌకముగానో డైమన్ విధముగానో కోసివుంచుము. బాగా చల్లగా ఆరిన వెనుక బిళ్ళలు తయారు అవును. అప్పుడు తీసి వుపయోగింపుము. ఇది రుచికరముగా వుండుటకాక బిడ్డలకు మంచి ఆహారము.

M. R. సీతమ్మ

# ప్రతిజ్ఞ

—(౦)—

(గత సంచిక తరువాయి)

ఏదో ఒక వింత మృగాన్ని చూడ్డానికి వచ్చినట్లొచ్చేవారు ఆ వూరివారంతా జ్యోతిని చూడడానికి. మనుష్యుల మొగమెరుగని జ్యోతికి ఇదంతా క్రొత్తగా వుండేది. ఆ వచ్చేపోయే గుంపును చూసి హడలిపోయేది ... ఎవరితో ఎట్లా మాట్లాడాలో, ఏమనాలో ఆమెకేమీ తెలీదు. వచ్చినవాళ్లు వూరికే వెడతారా ?

"అయ్యో ! ఇదేం అయోమయం పిల్లమ్మా ! రెండేండ్లపిల్లకి తెలిసినపాటైనా తెలీదాయె. ఎడ్డి మృగంలావుంది. తీర్చిదిద్దడానికి తల్లైనా లేదు అని ఒకరూ. ఇన్నేళ్లొచ్చాక ఇకమారేదేమిటని ఒకరు, పెళ్లెల్లా అవుతుందమ్మా ! అని ఇంకొకరూ, అయిందేదో అయిపోగా పాపం రాంగోపాల్‌కి ఈ ముసలితనంలో ఇదో తాపత్రయం" అని ఒకళ్లూ గొణగసాగారు.

తల్లిలేని ఇంటిలో ఈడువచ్చిన పిల్లనుంచడం భావ్యంగాదని, వున్నడబ్బు నసరాచేసికొని ఏదో మంచి సంబంధమే కుదర్చగలిగాడు రాంగోపాల్. పిల్లవాడు B. SC. ప్యాసయి పైచదువులకి ఇంగ్లండు వెళ్లదలచుకున్నాడు. ఆ చదువుకయ్యే ఖర్చు భరించేందుకు వొప్పిదమే ఈ సంబంధం కుదరడానికి కారణం. ఎలాగైతేనేం అన్నీ సిద్ధంచేసాడు ... మంగళసూత్రధారణముందు పెళ్ళివారు పేచీపెట్టడం మూలంగా జ్యోతికున్న ఆస్తంతా ముందే పెండ్లికొడుకుపేర రాయవలసి వచ్చింది. జ్యోతి మేనమామ మదన్ ఇలా జరగడానికి వీలులేదని చాలా పేచీపెట్టాడు — ఎలాగో ఒకలాగ పెండ్లి జరిగితే చాలని చూస్తూవున్న రాంగోపాల్ అతనిమాట లెఖ్ఖచెయ్యక ఆస్తంతా రాసిచ్చేసాడు. అమాయక జ్యోతి తనకు జరుగుతున్న అన్యాయం గుర్తించలేకపోయింది. బాబా ఇనుప పిడికిలిలో మెలిగిన ఆమెకి స్వతంత్రభావనమేలేదు. ఈ భర్త, ఈ పెండ్లి ఆమెకంతా వింతగావుంది.

సంసార పద్ధతులూ, కుటుంబ బాధ్యతలూ అన్నీ మెల్లమెల్లగా నేర్చుకుంటోంది జ్యోతి. కాని ఆమె దౌర్భాగ్యం ఆమెని విడిచేటట్లులేదు. పెండ్లి అయిన ఆరునెలలకే తండ్రిగూడా చనిపోయాడు ... ఇక జ్యోతికి దిక్కెవ్వరు ?

లేనిపోని గుసగుసలంతా మొదటనే మొదలెట్టారా వూరివారంతా. —ఇక చెప్పనే అక్కరలేదు.. జ్యోతి, మూర్తీభవించిన నిర్భాగ్య దేవతయనీ, ఎక్కడ పాదంపెడితే అక్కడే నాశనమనీ అనుకొంటున్న గుసగుసలు ఆమె అత్తవారింటివరకుకూడా ప్రాకాయి. ఇంతటి నిర్భాగ్యురాలిని తమ ఇంటికి తీసుకురావడం ఇష్టంలేక జ్యోతిని వదలివేశారు. జ్యోతి భర్త అశోక్ ఇంగ్లండులో వున్నాడు. అతనికి లేనిపోనివన్నీ కల్పించి వ్రాసి అతని మనస్సుని పాడుచేసారు తల్లిదండ్రులు.

ఏకాకి అయిన జ్యోతి ఏమిచెయ్యాలో తెలీక విచారంలో మునిగిపోయింది. తననుగూర్చి తన వూరివారంతా చెప్పుకుంటున్నమాటలు ఆమె చెవులను బ్రద్దలు చేస్తున్నాయి. ఆ సమయంలో ఇదంతా విని ఆమె మేనమామ మదన్ వచ్చి ఆమెను తన ఇంటికి తీసుకొని వెళ్లాడు.

అలహాబాదులో మేనమామగారింటికి వచ్చింది జ్యోతి. మదనుకి పిల్లలులేరు. జ్యోతి రాక మేనమామకు, అత్తకు, ఆనందం గల్గించింది. అత్తగూడా ఆమె నెంతో ప్రేమగా చూడడం మొదలెట్టింది. పాపం జ్యోతికి వీరిల్లొక స్వర్గంగా గన్పించింది. అత్త అదుపాజ్ఞలలో ఆమె అన్ని పనులూ చక్కగా నేర్చుకుంది. మదన్ పూర్వంలా కాక కోర్టుపనిగానే క్లబ్బుకైనా వెళ్లకుండా ఇంటికి రాసాగేడు. ఆ భార్యాభర్తలిద్దరికీ ఈ జ్యోతితో చక్కని కాలక్షేపం అయిపోతోంది.

మదన్, అశోక్‌కి ఎన్నో వుత్తరాలు రాసాడు.

ఒక్కదానికీ సమాధానంలేదు. జ్యోతిని గూర్చిన మాయమాటలన్నీ అతని తలలో నాటుకుపోయాయి.

మదన్ ఇంటివద్ద మాష్టర్లనిబెట్టి జ్యోతికి చదువు చెప్పించసాగాడు ... ఆమె సూక్ష్మ బుద్ధికి అతనికే ఆశ్చర్యంవేసింది.

రెండేళ్లు పూర్తయి అశోక్ ఇంటికి వచ్చాడు. ఇదే సమయమని మదన్ వారింటికెళ్ళి పిల్లని తీసికెళ్లమని బ్రతిమాలాడు. కాని వారు నిర్మొహమాటంగా అటువంటి నిర్భాగ్యురాలిని తెచ్చుకొని, పండువంటి సంసారం పాడుచేసుకోలేమన్నారు. చదువుకొన్న వాడుగదా! లోకజ్ఞానం కాస్తయినా వుండదా అని అశోకునితో అనేక విధాల చెప్పిచూసాడు మదన్. లాభంలేకపోయింది. ఇంగ్లండువెళ్ళి చదివి వచ్చేననే గర్వంతో మిడిసిపడుతున్న అశోక్‌కిచెప్పి లాభంలేకపోయింది. ఇక కోపం ఆపుకోలేక "ఇందుకనే పెండ్లిలో ఆ డబ్బంతా ముందే రాయవద్దన్నాను, ఆ డబ్బులేకపోతే ఎలా వెళ్ళేవాడివో ఇంగ్లండు ... ఈ నిర్భాగ్యురాలు పనికిరాదుగాని ఆ నిర్భాగ్యురాలి భాగ్యం పనికివస్తుందేం" అన్నాడు.

"అదా మీ వుద్దేశ్యం! ఆ డబ్బు రాసిచ్చారు గనుకనే ఆ దౌర్భాగ్యురాలికి మూడు ముడులూ పడ్డాయి. లేకపోతే పుస్తెకట్టేవాడెవరు? పుట్టినింటికి కళంకమై అట్లా వుండవలసిందేగా!" అన్నాడు సగర్వంగా అశోకు తండ్రి ...

"ఏమిటండీ ఈ అడవి మృగాన్ని తీసుకొని నేనెక్కడకి వెళ్ళను? నలుగురూ నవ్విపోతారు. నాకు మెద్రాసులో వుద్యోగమైంది. అక్కడికి ఈ మొద్దును తీసుకొని వెళ్ళనా? ... ఆమె జీవితం నా జీవితంతో ముడిపెట్టి నన్నుగూడా సర్వనాశనం చెయ్య చూడక నన్ను బ్రతకనియ్యండి. ఆమెకి మొగుడెందుకు? ఎక్కడో ఇంత తిని తిరుగుతే చాలు, కావలిస్తే మనోవర్తి పడేస్తాను" అన్నాడశోక్.

ఈ మాటలు మదనుకి శూలాల్లా గ్రుచ్చుకున్నాయి. ఇక ఓపిక పట్టలేక "నీ మనోవర్తెంత, నువ్వెంత తిన్నింటి వాసాలు లెక్కపెట్టేరకం. దాని డబ్బు తిని పైగా దానికి మనోవర్తిస్తావా? నీ జన్మంతా ధారపోసినా దాని ఋణం తీర్చుకోలేవు. ఇదిగో ఈ వాళ ప్రతిజ్ఞ చేస్తున్నాను ... ఎప్పటికైనా నువ్వు దాని కాళ్ళపైబడి బ్రతిమాలవలసినవాడివే. జ్ఞాపకముంచుకో" అని మండిపడుతూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు ...

వెకిలిగా నవ్వుతూ అశోక్ "ఆహా ... నేను దాని కాళ్ళమీదపడతానా ... చూదాం! మీ జోస్యం! ... అపరభీష్ముడిలా వున్నారే మీరూ ... మీ ప్రతిజ్ఞ ..." అనివిరగబడ్డాడు ... మదనుని రక్తం వుడికిపోతోంది. ఎలాగైనా ఈ అశోక్‌ని బుట్టలో పెట్టించి తన ప్రతిజ్ఞ చెల్లించుకోవాలనుకున్నాడు. జ్యోతికోసం తన ప్రాణాలైనా అర్పించసిద్ధమయి అన్నిటికీ తెగించి ఆమె భారం పూనాడు ... అశోక్‌కి మదరాసులో పని అయిందని తెలిసికొని మదన్ తన ప్రాక్టీసుకి కొంతకాలం స్వస్తిచెప్పి జ్యోతిని తీసుకొని మదరాసు చేరుకున్నాడు. ఆమె నక్కడ కాలేజీలో చేర్చాడు. ఇప్పుడామెలో పూర్వపు చిహ్నలేమీలేవు. పూర్తిగా మారిపోయింది. ఇదివరకు తననుచూసి వెక్కిరించిన వారందరినీ తనే వెక్కిరిస్తోంది. సహజ సౌందర్యవతియగు ఆమెకి నాగరికత జతగూడడంచేత, మెరుగు పెట్టిన వజ్రంలా మెరిసిపోతోంది.

ఆ అశోకుని ఆ చోకీలన్ని తీయడమే మదనునిపని ఇప్పుడు ... అతని చుట్టూ రహస్య పరిశోధకుడై తిరుగుతున్నాడజ్ఞాతంగా ... అశోకుడే యేస్థలములకు పోవునో కనిపెట్టి అచ్చటకే సరిగా - జ్యోతిని పంపుచుండును.

అశోక్ జ్యోతిని మునుపెన్నడూ చూసియుండలేదు. అతని వూహలో ఆమె ఒక అజ్ఞానాంధకారంలో మునిగినపశువు - అంతే ఆమె రూపైనా అతనికి జ్ఞప్తిలేదు. కాని తనవద్దవున్న ఒక ప్రతి

బింబము మూలకంగా జ్యోతి మాత్రం తన భర్తను చక్కగా పోల్చుకోగల్గింది. కొద్ది కాలానికే వారిద్దరికీ ఒక తోటలో పరిచయం అయింది. స్త్రీ తలచుకుంటే పురుషుని లొంగతీయడం ఎంతపని! అదే తన జీవితాదర్శంగా పెట్టుకొన్న జ్యోతికీ విషయంలో విశేషం శ్రమ గల్గలేదు. అచిరకాలంలోనే అతనిని స్వాధీనపరచుకొంది ఒక రోజు అశోక్ అతిదీనంగా ఆమెకు తన మనోభావం వెలువుచ్చాడు. "పెండ్లి ఎందుకు? పెండ్లిచేసుకొంటే మనలో ఈ స్నేహ భావం వుండదు. ... ఒకరిని పెండ్లిచేసుకొని బానిసలా పడివుండడం నా చేతగాదు. అయినా ... నీవు పెండ్లయినవాడివి నేడామెను వదలి నన్ను పెండ్లిచేసుకో సిద్ధపడినట్లే రేపు నన్ను వదలి మరియొకరిని గోరవచ్చు ... నీకు భార్య వుండగా మళ్లీ పెండ్లేమిటి" అని ఆమె అతనిని అసంతృప్తుణ్ణిచేసింది ... ఎన్ని సారులా ప్రసంగం ఆమెవద్ద తెచ్చినా, ఆమె వప్పుగోనక బెట్టు చేయిసాగింది. అశోక్ వెఱ్ఱివానివలె ఆమె చుట్టు తిరగనారంభించాడు.

జ్యోతి ఒకనాడు "నీ భార్యను నీ వెన్నడైనా చూసావా" అని అడిగింది ...

ఆ ప్రశ్నకేం చెప్పాలో తెలీక తబ్బిబ్బులవుతూ "లేదని" జవాబు చెప్పాడు — "అయితే ఆమె నా కన్న అందమైందేమో! ఇతరుల మాటలువిని చూడనైనా చూడకుండా ఇంతపనిచేస్తున్న నిన్ను ఏమనాలో తెలీడంలేదంది. ..."

"ఆమె అందమైందేగావచ్చు, నీ కన్న అందమైన వాళ్లెందరో వుండవచ్చు. కాని నాకా అందంతో నిమిత్తంలేదు. నా ప్రేమ మొట్టమొదట నీ స్వాధీనం అయింది. పరిస్థితులవల్ల అది ఆమెకి దూరమైంది. నీ కిష్టమున్నా లేకపోయినా నీవే నా హృదయేశ్వరివి నీకై ఏపనిచేయడానికైన సిద్ధడ్నే"నని అతడు ఆమెవైపు చూడసాగాడు. ఇక విజయం తనదేననే విజయ గర్వంతో ఆమె అతనిని చేబట్టుట కంగీకరించింది.

ఆ నాడే పెండ్లి రిజిస్టరయిపోయింది. జ్యోతి అశోక్‌ని తన ఇంటికి తోడ్కొని వెళ్ళింది.

గుమ్మంలో ఎవరు? మదన్ భార్యా సమేతుడై నూత్న వధూవరుల్ని ఆహ్వానిస్తున్నాడు. గుమ్మంలో అడుగు బెట్టిన అశోక్ నివ్వెరపోయాడు.

"అశోక్ ఏమిటలా చూస్తున్నావు? కోరి ఏరి రిజిస్టరుమేరేజి చేసుకొన్నది నీ వెవరినో తెలుసునా? అగ్నిహోత్ర సాక్షిగా పెండ్లాడిన నీ ధర్మపత్ని జ్యోతినే! ఇదే నా ప్రతిజ్ఞ" అన్నాడు మదన్ సగర్వంగా ...

ఏమైతేనేంలెండి నా జ్యోతిని, మనో జ్యోతిని చేసారు. Thanks అన్నాడు అశోక్.

—:o:—

## వివాహ మహోత్సవము

అభివృద్ధి ప్రణాళికల ప్రచారమాసపత్రిక ఆంధ్రవాణి సంపాదకులగు శ్రీ యన్ శ్రీకంఠమ్ గారికిని, గవర్నమెంట్ బేసిక్ ట్రైనింగ్ స్కూల్ లెక్చరర్ గారగు కుమారి అత్తిలి స్వరాజ్యలక్ష్మిగారికి కడప శ్రీ వెంకటేశ్వరస్వామి సన్నిధిలో వివాహ మహోత్సవము జరుపబడినది. పలువురు ప్రముఖులు వధూవరుల నాశీర్వదిస్తూ సందేశములు పంపిరి.

# స్వామి శ్రీ శివానంద జన్మదిన సందేశము

—X—

అనువాదము: "శివానంద పాదసేవక్" స్వామి శ్రీనివాసానంద సరస్వతి

నేడు మానవజాతి నెదుర్కొనుచున్న సమస్యలన్నియు శాంతిపై నాధారపడి యున్నవి. శాంతిని పొందు రహస్యమియ్యబడుచో వివేకియై నాగరికతను, నైశ్వరవంతమగు సమాజమును సౌఖ్యవంతమగు గృహమును, తెలివిగలవ్యక్తిని మానవుడు నిర్మింప శక్తిగలవాడగును.

కండ్లకు గంతలుకట్టబడి చీకటిలో వెదకుచు మానవుడు ఆటంబాంబు పరికరము, హైడ్రోజన్ బాంబు పరికరము వాటిని వాడుటకు మిక్కిలి "ఫలవంతమగు" విధానములు, రాజ్యాంగ స్వాతిశయపుగర్హనీయమైన నాదర్శనీయతలు, నార్థిక స్వతంత్రాధికారము జాతీయవైభవము, వ్యక్తిగతశక్తులగు విధ్వంసక సాధనముల వరుసను మాత్రమే పట్టుకొనును.

ఈనాడు వ్యాప్తమైన "శాంతి" భయపుశాంతియు, సన్నాహపు శాంతియునై యున్నది. జ్ఞానవంతులగుమనుజుల మనఃపూర్వక సలహాను తృణీకరించి ప్రపంచమందలి గొప్పజాతులు తమవిధ్వంసకబలమును ప్రదర్శింప నుద్దేశించుచుండిరి. ఆ విధమున యుద్ధము నిలుచును, శాంతి కాదు. వివిధ మతములకు, వివిధ జాతులకు నింకను వివిధ తెగలు లేదా కులములకు చెందిన జనులు మతము, దేశాభిమానము, మఱియు వివిధేతర స్వకీయాభిమాన తత్త్వముల సుందరనామమున నేటి సామాజిక నిర్మాణమున నేవి భాగములున్నవో నవి మానవుని సౌకర్యమునకు జనసామాన్యాభ్యుదయ పెంపుదలకు కలవని నా తృణము మరిచి యీర్ష్య, పగ, ద్వేషము నితరులపట్ల రేకెత్తింతురు.

మానవుని హృదయమున లేచు నీ పొసగమి తొలుత గృహమును సోకి క్రమేణ సమాజమునకు, తదుపరి జాతికిని (దేశమునకును) విశాల ప్రపంచమునకును వ్యాపించును. ఎంత మొత్తమేని సామాజిక నిర్మాణమున పునఃపరిమార్పొనర్చుటయు, రాజకీయ కట్టుబాటున విప్లవము యు మొనర్చుటయు శాశ్వతశాంతిని గొనిరాదు. ఇవి యెట్లనవసరమో నట సహితము నవి మానవుని హృదయమునుండి జాతికై నుద్భూతము కావలెను.

శాంతి మానవుని ఆంతరంగికమైన ఆత్మయొక్క స్వభావమై యున్నది. "శాంతో అయం ఆత్మా" ఆత్మలోవసించు నీ శాంతిని నెవడైతే నీయాత్మ ననుభూతి

నొందుటకు సహితము యత్నించునో, నెవడైతే నీయాత్మపట్ల తన దృష్టిని మరల్ప ప్రారంభించెనో నాతడనుభవించును. ఎటులనైతే ప్రధాన శక్తివంత ప్రేలుడులు చుట్టు ప్రక్కల మైళ్లకొలది విధ్వంసము వ్యాపింపచేయునో నాత్మయొక్క శాంతి యొక్క నీప్రాపంచిక పరిణామాతీతానుభవము నిట్టి యనుభవముగల యోగితో తనంతటతాను మనోసంబంధమేర్పరచుకొను ప్రతియొకని హృదయము నుండి యజ్ఞానము, పాసగమియు నెడి యంధకారమును పోద్రోలు శక్తివంతమగు శాంతి ప్రవాహమును తృప్తిచేయును. ఆత్మ సాక్షాత్కృతియొక్క నాంతర్యాధ్యాత్మికానుభవముగల నొక కొలదిమంది యోగులు సహితము యావత్తు ప్రపంచమును పరివర్తన మొందింపగలిగి శాంతి సమృద్ధి, యైశ్వర్యముల గొని తెత్తురు. ఏలన వారియెడ భక్తిగలగిన లక్షలాది జనులు వారిచే సంపాదింపబడిన నాధ్యాత్మిక సంపత్తులభాగ మొందుదురు. వారొకే ఆత్మ సమస్తములోను వసించు ననియు నొకే జీవితము సమస్తములోను జీవించుననియు, నొకేవిశ్వేచ్ఛ అసంఖ్యాక జీవులద్వారా దానంతటది వ్యక్తమగు ననియు గ్రహింపప్రారంభింతురు. వారన్ని విభాగములు మానవ జితమనియు, సర్వహద్దులు మనోకల్పిత మనియు చూడనారంభింతురు. వారు మానవానీకపదములలో యోచించుట విశ్వప్రేమయగు విశ్వమతమును నాచరించుట ప్రారంభింతురు. ఇదియే శాంతికి బాట.

కాన దృష్టి లోనికి త్రిప్పుడు ఇంద్రియముల తలుపుల మూయుడు! అలజడి నొందు మనస్సు నరికట్టుడు! సంశయించు బుద్ధినిహత మొనర్పుడు. మీ హృదయమును విశ్వాసము, భక్తియనెడియమృతముతోడనింపుడు స్వార్థరహితముగ ప్రజాకోటిని సేవింపుడు. జపమొనర్పుడు. ధారణ సల్పుడు. ధ్యానింపుడు. ప్రార్థించి వేచియుండుడు. లోనశాంతినన్వేషింపుడు. ఆతానుభూతినొందుడు. మానవజాతి కత్యుత్కృష్టోపకారియగు యోగిగ విరాజిల్లుడు.

భగవానుడు మిమ్ములనందరు నారోగ్యము దీర్ఘాయువు, శాంతి, సౌభాగ్యము, నాత్మసాక్షాత్కృతితోడ నాశీర్వదించు గాక!

హరిః ఓమ్‌తత్సత్!

# గోముఖి...

'హృదయిని'



సంధ్యాసమయం. టంగ్ - టంగ్ - టంగ్ - టంగ్ - టంగ్ - అని గడియారం గంటలుకొట్టింది. మావారికి సినిమాకు వెళ్ళాలని సంకల్పం కలిగింది. ఆదరాబాదరాగా నాదగ్గరకు వచ్చి, 'సరళా! ఊళ్లో శాంతారాం తీసిన డాక్టరు కోట్నీస్ ఆడుతున్నదట. వెడదాం పద,' అంటూ నన్ను తొందరపెట్టారు. మావారి కలవాటే - ఏదైనా సంకల్పం హఠాత్తుగా కలుగుతుంది! సంకల్పించిన వెంటనే అది నెరవేరాలి! దాంతో నేనొకటిచేయబోయి యింకొకటిచేస్తూంటా. ఏంటీ ఆలస్యం-అని వారి అరుపులు! పదినిమిషాల్లో తయారయ్యా. వారూ తయ్యారయారు. ఈ జంట వెళుతున్నది సినిమాకు అని చూచేవారికిట్టే తట్టేటట్లు.

రిక్షానుంచి, ఆళాథియేటరుదగ్గర దిగాం, ఆట మొదలెట్టలేదు. కాని అక్కడ ఆడుతున్నది - ఆద్మీ. మావారు, 'సరళా!' 'కోట్నీస్' లేదు. 'ఆద్మీ' ఆడుతుంది. ఇదైనా శాంతారాం కళాఖండమే. దీనికధ రాసింది ఒక ఆంధ్రుడు', అని ఒక్కగుక్కలో చెప్పారు.

'మీ యిష్టం;' అన్నాను కొంత విచారంతో. ఎందుకంటే 'కోట్నీస్' చిత్రాన్నిగూర్చి ప్రసిద్ధ పత్రికలు, అపుడపుడు మావారు పలికిన ప్రశంసా వాక్యాలు గుర్తుండి, ఆఫిల్మ్ కాదే అని మనసు చివుక్కుమన్నందున.

మావారు గమనించి, 'పోనీ అది వచ్చినపుడే వద్దాం' అని తటపటాయించారు. 'పోనీలే వెళదాం పదండి' అన్నాను నేను. 'ఇంటికా సినిమాకా!' అన్నారు వారు. 'మీయిష్టం' అన్నాను మళ్లీ. 'అయితే యింటికే వెళదాముపద. కోట్నీస్ వస్తే మళ్లీదానికి డబ్బు లెక్కడవస్తాయి?' అని తన 100 రూ. ల పంతులుద్యోగం స్మృతికి వచ్చి వెనక్కు మళ్లారు నా చేతిని పట్టుకొని.

రిక్షా యెక్కి వెళదామా, నడచి వెళదామా, అని ఆలోచనలో పడ్డా మిద్దరం. థియేటరునుంచి బయటికి వస్తూ ఒక కారు మా ప్రక్కనే ఆగింది. కారులోంచి తల బయటపెట్టి మా వారిని ప్రశ్నించాడు కామదాసు - 'ఏమండీ! సినిమాకు వచ్చి తిరిగి వెళుతున్నారేం! సినిమా చూడరా?' అని.

కామదాసు మా యెదురింటివాడే.

డాక్టరు P. కామదాసు M. B. B. S.,
EYE & E. N. T. స్పెషలిస్టు

అని అతగాడి యింటితలుపుమీద ఓ చిన్న బోర్డుంటుంది. రూపురేఖలిలావుంటయి: బట్టతల, గుబురైన కనుబొమ్మలు చంద్రహాసలోని దుష్టబుద్ధిని గుర్తుకు తెస్తుంటయి. పొట్టిమెడ. కొంచెం గూని పల్కరించినపుడు తొంగిచూస్తూండే బంగారం పన్నులు రెండు. నిత్యం షేవింగుచేసివుండే గడ్డం. చామనచాయ, స్థూలశరీరమే. అధునాతన ఆంగ్లేయ ఫ్యాషనులో సూటు, బూటు, హేటు, సైకిలు వాహనం. వయసుదాదాపు 40. ఇద్దరు బిడ్డల తండ్రి. అపరిచితులకు చూచీచూడటంతో సంపాదనపరుడుగా కనుపిచ్చేమనిషి. నిజానికతడు ఆంధ్రుడుగాడు, ఏ కొంకిణీజాతికో చెందినవాడు.

డాక్టరు కామదాసుకు మాకు అప్పటికి కించిత్తయినా పరిచయంలేదు. చొరవచేసుకొని ఆనాడెందులకు పలకరించాడో మరి!

మావారు అతగాని మాటల్లో సినిమాకు ఆహ్వానిస్తున్నాడన్న అర్థంతీసుకొని. 'ఎబ్బే-డాక్టరు కోట్నీస్ ఆడుతుందని వచ్చామండి. అదిలేకపోవటంచేత తిరిగి పోదామనుకుంటున్నాము,' అని చిర్నగవుతో ప్రత్యుత్తరించారు.

'ఎందుకండీ, ఆద్మీకూడా చాల మంచి చిత్ర

మండి!' అన్నాడు కామదాసు, మావారికి హిందీ సినిమా ప్రపంచం సుపరిచితమన్న సంగతి రవ్వంత తయినా తెలియక.

'అలాగాండి!' అన్నారు మావారు.

'రండి, నేను మిమ్మల్ని లోనికి తీసుకెళతాను' అన్నాడు కామదాసు హుందాతనంతో.

'స...రే...పదండి' అన్నారు మావారు దరహాసంతో.

కారుదిగి, 'సినిమా వదిలేవేళకు రావోయ్' అని కారుడ్రైవరు కాదేశించాడు కామదాసు; ముగ్గురము థియేటరులోనికి నడచాము. అశానుహాలు ఆ వూరికల్లా చాలా అందమయిన థియేటరు. కామదాసు ముందు నడుస్తుంటే వెనక మేమిద్దరం బాల్కనీమెట్లెక్కి వెళ్ళి లోనమెత్తని కుషన్ కుర్చీలలో కూర్చున్నాం. ఆట మొదలెట్టడానికింకా టైముంది.

'బాయ్!' అని కేక వేశాడు కామదాసు.

మా వారు నావైపు చూశారు, - అతగాడేదో తెప్పించబోతున్నాడన్నట్లు.

బాయ్ - కుర్రవాడుగాదు - గడ్డంమీసాలున్న వాడే ఒకడువచ్చి వినయంగా నిలబడ్డాడు.

'మూడుప్లేట్లు చాక్లెట్లు,బిస్కట్లు, తీసుకరా?-' అని కామదాసు పిల్లజమీందారులా ఆజ్ఞాపించాడు.

మావారు,"ఇపుడెందుకండవన్నీ-మేము భోంచేసే వచ్చాము," అన్నారు

'మీరు సంకోచించకండి, ఈ మాత్రం లైట్ టిఫిన్లకు జడిస్తే ఎలా?' నవ్వుతూ అన్నాడు కామదాసు.

బాయ్ ట్రేలో ఆర్డరిచ్చిన పదార్థములతో తయారయ్యాడు. తినడం పూర్తయింది. ఆపై కాఫీ, కిల్లీకూడ. పదార్థములమీద క్రమంగా అసామాన్యమైన ఉపన్యాసం చెప్పుకపోతున్నాడు కామదాసు. ఛలోక్తి మాట్లాడినానుకొన్నప్పుడు ఓరచూపుతో చిర్నవ్వుతో నావైపుచూశాడు. లైట్లవెల్తురులో ముందరి బంగారపురేకుపళ్లు తళతళా మెరసినవి. సిగరెట్టు పెట్టె తీసి మావారి కందించాడు. వద్దంటూ మావారు స్వీకరించారు. తానొకటి తీసుకొని డాక్టరు అగ్నిహోత్రం చేయటంలో సహాయం చేశాడు.

మావారు సిగరెట్టు ముట్టించుకొని,'మీరు నిత్యాగ్నిహోత్రుల్లావుంది!' అని చలోక్తి విడచారు.

'అంతగా కాదండి, ఏదో రోజుకు నాలుగు పెట్టెలు దగ్ధంచేస్తాను!' అని ప్రతి ఛలోక్తి వచ్చింది కామదాసునుంచి.

సినిమా యెపుడో ప్రారంభమయింది. నేను సావధానంతో సినిమా చూడసాగాను. 'కాని, ఈ ఆద్మీకి వేసినతను సాహూమోడక్ అనీ, అతని తొలిచిత్రాలు ఫలానివి, ప్రస్తుత చిత్రాలు ఫలానివీ, ఇపుడు మోడక్ చాలా స్థూలం అయ్యాడు, ఈ చిత్రంలో వేశ్యపాత్రధారిణి శాంతా హుబ్లీకర్ అనీ అనేక ప్రశంసావాక్యావళితో ఒకటే సొదగా చెవి క్రింద ధ్వనిచేస్తున్నాడు చెవితెగిన నక్కలా ఆ కామదాసు. నాకు మా చెడ్డ చిరాకు వేసింది, పాడు సినిమా లేకపోతే పోయింది, యింటికి పోదామా అని మా వారిని రెండుమూడుసార్లు స్పృశించాను. వారు ఎక్కడా వుండని సహనభావంతోవుండి, 'సహించు సరళా' అన్నట్టు సంజ్ఞచేశారు.

'ఒక ప్రక్క సినిమా నడిచిపోతూన్నది, ఇంకొక ప్రక్క తనకీవూరిలోనున్న హోదా, తాను నెలకెంత సంపాదిస్తుంది, తానెంత ఖర్చుచేస్తుంది ఇత్యాది స్వవిషయాలు అయాచితంగానే ప్రశంసించుకపోతున్నాడు డాక్టరు కామదాసు. ఇంకా ఈ థియేటరు వాళ్లు మనకు ప్రియమిత్రులు. వారికి మనతో చాలా అవసరంపడుతూ వుంటుంది. అంచేత మన కీథియేటరులోకి ప్రవేశం ఎపుడుపడితే అపుడే. నోటికెట్ యెటెనీటైమ్ ఫర్ యెనీ పిక్చర్ ఆర్ డ్రామా,

అసలు ఈ వూరిలోవున్న థియేటర్లన్నీ మన కిలాంటి స్వాగతాన్ని యిచ్చేవే!' అని దర్పం, దరహాసం చూపించాడు డాక్టరు.

సినిమా అయిపోయింది. బయటకు వచ్చేటప్పుడు నా వైపు రెండు మూడు సార్లు వివపూరితమయిన దృష్టులు - అతని ఉద్దేశంలో అమృత భరితమయిన విగా వుండొచ్చు - ఇరువదేండ్ల పడుచువాడిలా చూచాడు. ఏంటీ బిడ్డలతండ్రి యిలా చూస్తాడని పించింది.

థియేటరు బయట డాక్టరుకారు నిలబడివుంది. 'రండి కారెక్కి వెళదాము నేనూ ఇంటికే వస్తున్నాను.' అని కులాసాగా కోరాడు.

నా సంజ్ఞ ననుసరించి, 'ఫరవాలేదులెండి, మధ్య మాకు పనివుంది. మేము రిక్షాయెక్కి వెళతాం రేపు మిమ్మల్ని దర్శించుకొంటాను. సెలవు' — అన్నారు మావారు.

'అదేమిటండీ! మనమంతాకలసి కారులో వెళదా మనుకొన్నానుగదా' అన్నాడు డాక్టరు తన ముఖం నిరాశా ప్రపూర్ణంగా.

'ఫర్వాలేదు. మీరు ఇప్పటికి చూపిన సౌహార్ధమే ఎంతో ఘనమయింది. సెలవు!' అన్నారు మా వారు.

... రిక్షావాహనంపై యింటికిచేరాము సతీపతు లిద్దరం.

'ఏం సరళా! ఈ నాటి సినిమాప్రోగ్రాము సినిమాలోని సంఘటనలాలేదూ ?'

'అవునండి. ఇంత అవ్యాజమైన ప్రేమ, స్నేహం డాక్టరు కామదాసులో వున్నట్లు ఎప్పుడూ వెల్లడి కాలేదే ?'

'పిల్లలమీద, బంట్రోతులమీద ఒకటేతీరుగా పొలిమేర కేకలు పెడుతుంటే, తీక్షణమైన ఆ చూపుల వల్ల నేనెపుడూ అనుకోలేదు ఈతనిలో ఇంత సౌహార్ధం దాగుందని!'

'అయినా, ఈ స్నేహం ఇంత త్వరలో ఆకాశ పథం అందుకొందెందుకో ?'

'అదే నాకూ విచిత్రంగావుంది. భర్తృహరి చెప్పిన మైత్రిసంబంధమైన పొద్దుటిపూట ఎండలోని నీడలు గుర్తువస్తున్నాయి. ఈ ఆకస్మిక ప్రాదుర్భావిత — ప్రగాఢమైత్రి అలాంటిదని నాకుతోస్తుంది!' అన్నారు మా వారు సమాస ప్రయోగంతో.

'నా కదే తట్టిందినుమండీ.'

'సరే. దీని పరిణామం ఎలా వుంటుందో చూస్తాంగా ?'

♦ ♦ ♦

వసతయిన యిల్లుకోసం ఎదురుచూస్తున్న మాకు ఆ పేటలోనే మరొక వీథిలో మంచి యిల్లు దొరికింది ; మేమూ యింటికి మారాము.

కామదాసుకు మా వారికి మైత్రి హెచ్చింది. డాక్టరింటికి మా వారి రాకపోకలు ధారాళమయినయి. డాక్టరున్నూ మా యింటికి అడపాదడపా రావటంపడింది. మా యింటిలో మావారెపుడుండేది, ఎపుడుండనిదీ, ఎంతమంది వుంటుంది మొదలయిన అనవసరమయిన ప్రశ్న పరంపరలకు ప్రత్యుత్తరాలు సేకరించాడట మావారి దగ్గిరనుంచి డాక్టరు. ఎప్పుడూ స్వప్రకర్ష ప్రశంసేనట. Art of bordom లో డాక్టరేటు పొందదగినవాడట!

ఇంకొకవారంలో శాంత జ్ఞానేశ్వర్, పర్ ఛాయీ ఆ డాక్టరూ మేమిద్దరం చూడటం సంభవమయింది. అవ్యక్తమయిన యే ఆశతో ఆ మహానుభావుడు మమ్మల్ని వూరకనే సినిమాకు తీసుకొనివెళుతున్నాడో నాకర్థంకాలేదు. ఆ సినిమా ప్రోగ్రాములు ఇలా వుండేవి — మావారు డా॥ ఇంటికి వెళ్ళినపుడు ఈ రాత్రి సినిమాకు వెళదాము, సరిగా మీరు థియేటరు దగ్గరకు ఇన్ని గంటలకు రండి, నేను మీ కోసం థియేటరువద్ద ఎదురుచూస్తుంటా - అని ఆ డాక్టరు చెప్పటం, సరళా ఈ వేళ సినిమాప్రోగ్రాముందనడం, బయలుదేరడం ప్రప్రథమంలోని ఆతిథ్యం - చాక్లెట్లు,

బిస్కట్లు, కిళ్లీలు ఒకొ్కక్కటే మటుమాయమయి పోయినవి. మావారు అతగాడు సిగరెట్లు దగ్ధపటలం చేయడ మెక్కువయింది; వాస్తవానికి మావారికి సిగరెట్ల అలవాటులేదు. థియేటరులోనే ఒక సంభాషణ మధ్యలో – 'మీ ధర్మపత్ని సుతులతో మా ఆవిడకు పరిచయం చేయండి. ఈ సినిమాలకంతా కలిసివస్తేనే బావుంటుందని నా ఉద్దేశం' – అని మావారు అభిమక్కత్తో అన్నారు.

'మా ఆవిడ అరిస్టోక్రాటిక్ అండి. ఆవిడకు మనవలె సోషయాలిటీ పనికిరాదు. మనం సినిమాలకు కలిసివెళుతున్నట్లు మా ఆవిడకు తెలియటంకూడ నాకిష్టంలేదు. అదిగాక నా ప్రిన్సిపిల్స్ ననుసరించి మా ఆవిడ గడపదాటి బయటికిరాదు.'

'దుర్మార్గుడు తన హృద్గతమయిన అసంస్కృతిని బహిర్గతంచేశాడు పొరపాటున. తన భార్య అయితే పరుని కంటబడకూడదు, పరాయివాని భార్య అయితే పదిమందితోకలసి తిరగాలన్నమాట,' అని లోలోన అనుకొన్నాను.

'అలాగాండి పోనీలే!' అన్నారు మావారు.

ఒకసారి అపాడుసిగరెట్లు అలవాటు లేకపోయినా దగ్ధంచేస్తున్నందువల్ల, అవి అయిపోగా స్నేహపూర్వకంగా ఒకపెట్టె తెమ్మని మావారికి డబ్బిచ్చి బయటకు పంపాడు ఆవైద్యశిఖామణి. అవి నాకు వినిపించేటట్లుగా - అప్యాయంగా - 'మీకు సినిమాలు బావుంటున్నాయా ?' - అని ప్రశ్నించాడు.

'నాతో భాషించడానికా మావారిని బయటికి పంపింది' అని తేలింది. ఎంతవ్యలీక మైత్రిని నెరపుతున్నాడు! ముక్తసరిగా సమాధానించాను - 'బాగానే వుంటున్నాయి,' అని.

... ఆ తర్వాత ... మాయింటికి అతగాడి బంట్రోతు కొన్ని మేగజైన్లు, కూరగాయలు, పండ్లు అడపాదడపా చేరవేయడం జరిగింది. అనుగ్రహాలు, ప్రసాదాలు ముమ్మరం అవుతున్నసంగతి గమనించి మావారు అన్నారు ఒకసారి - 'సరళా! వీడితరహా ఏదో అఘాయిత్యానికి ఒడిగట్టేటట్లుగా కనుపిస్తున్నది సుమా!'

ఒక యింగ్లీషు చిత్రం చూస్తున్నసమయం. మావారు సిగరెట్లకోసం బయటకు వెళ్లారు. అవకాశం చూసుకొని తానింతకుముందే భద్రంగావుంచిన కిళ్లీ ఒకటి నాకిస్తూ కొన్నిమాట లస్పష్టంగా పలికాడు కామదాసు 'రేపు ఉదయం 11 గం. కు మీ యింటికి వస్తా. నేనికిళ్లీ మీకిచ్చినట్లు చెప్పకండి!' అన్నరెండు వాక్యాలు మాత్రం వినిపించినవి. వాడి వేడినిట్టూర్పుతోడి సంభాషణక్రమం - వాడు మావారు పరమ అమాయకుడనుకోటం నాకు నవ్వు తెప్పించింది. మహారసికుడుగా - కార్యసాధకుడుగా భావించుకొంటున్న వాడి నీచబుద్ధిపై నాకెంతో అసహ్యం వేసింది. అపుడేమీ మాట్లాడలేదు. అంతలో మా వారు వచ్చేశారుకూడా.

ఇంటికి చేరాక మావారికి సర్వం వెల్లడించాను. మా వారు నవ్వి, 'సరే, యీ భ్రష్టుడి తపస్సుఫలించే సుదినం రేపే అవుతుందిలే!' అన్నారు.

మరునాడు మా అన్నయ్యకూడ వచ్చాడావేళే. బావమర్దుల మధ్య నాటికార్యక్రమం ఆమూలాగ్రం చర్చింపబడింది. మావారు కాలేజీకి సెలవు పెట్టారు మా అన్నయ్య. మా వారు ఒక గదిలో నిశ్శబ్దంగా 11 గం. లు ఎపుడు అవుతుందా అని ఎదురుచూస్తూ వుండిపోయారు.

11 గంటలు కొట్టింది. సైకిలు బెల్ మ్రోగింది బయట. కామదాసు గడపదాటి 'ఏమండీఉన్నారా?' అని నవ్వుల పువ్వులతో లోన ప్రవేశించాడు.

నన్ను భయం - ప్రకంపనం చుట్టుముట్టినవి. మనసుదిట్టపర్చుకొన్నాను. నేను అలమరదగ్గరకువెళ్ళి పుస్తకాలు సర్దసాగాను. అతనసర్వం సమీపానికి వచ్చి నాభుజంమీద చేయి వేస్తూ మెల్లగా మోహాలాపనలు మొదలెట్టాడు.

'మీవారు ఇంట్లో లేరనుకొంటాను'

'..............'

'మీ వారు వట్టి అమాయికులు సుమండీ! టీచర్లలో చాలమంది పుస్తకపండితులేనంటాను.'

'......' నేను కొంచెం వైదొలగాను.

ఆనర పిశాచాన్ని నామానం ఉత్సాహపరచింది కాబోలు.

'మీరు మా యింటి కెదురుగా వున్నపుడు ప్రతి ప్రొద్దున మా వాకిలివైపు చాలాసార్లు చూస్తూవుండేవారు. నేను గమనించాను. మీరునన్ను ప్రేమిస్తున్నారు గదూ!'

'నా మనసులో అనుకొన్నాను - నేనటుచూడటం ఎంత ముప్పు తెచ్చిపెట్టింది! — అని.'

నేను కొంచెంధైర్యం తెచ్చుకొని - 'చూసినంత మాత్రాన నేను మిమ్మల్ని...'

'ప్రేమిస్తున్నావు - అని మీ మా పుల లోని అమాయికత్వం చెప్పింది-చెపుతూంది.' అన్నాడు ఆ ఆ రసిక చక్రవర్తి.

'మీరు నాకు తండ్రివంటివారు'

'వయసులో అంతేకావచ్చు. మేము డాక్టర్లము. మాకు ఎపుడూ యౌవ్వనమే!'

'చూడండి - నేను మిమ్మల్ని...'

'ప్రేమిస్తున్నావా గాడిదా!' ఫెళ్లుమని కామదాను చెంపపగిలి ముందరిరెండు పండ్లు రాలినవి. యమభటుడిలా మా అన్నయ్య ప్రక్కనే ప్రత్యక్షమయియున్నాడు? చిర్నవ్వుతో మావారు - 'డాక్టరుగారా!' అన్నారు.

మా అన్నయ్య ఉగ్రరూపంతోనే, 'ఓహో డాక్టరా నమస్తే! నేనో డెంటిస్టును,' అని ఉపహాసించాడు.

# దుర్విధి

శ్రీ వేమూరి వేంకట సుబ్రహ్మణ్యం

రాజ్యము పరరాజుల చేతులలో చిక్కినది. అలమటించే పల్లీపట్టణ ప్రజలాత్మ సంరక్షణార్థము అరణ్యముల వెంబడి పర్వెత్తినారు. అచ్చటకూడ క్రూరప్రభుత్వము ప్రళయతాండవమొనర్ప సాగినది. కిరాతకులా కాందిశీకులపై బడి, వారి అర్థమానాల నపహరించి కన్నబిడ్డలను కాళికాదేవికి అర్పణచేయసాగిరి. చిక్కనివారిని వెంటాడి కర్కశనారాచముల కెరచేసి, నాకద్వారాలను చూపించుచున్నారు. ఆ సందర్భములో ఒక మాతృమూర్తి తన బిడ్డకై పడ్డ హృదయక్షోభ ఇందు వర్ణింపబడినది.

ఈ కరాళ తమస్వినీ హృదయమందు
ఈ భయంకరారణ్యమ హీతలాన
చంటి బిడ్డను హృదయమ్ము నంటిపెట్టి
పరగులిడుచున్న దెవ్వరో భయముతోడ

ఆమె సువిశాల మీన నేత్రాంచలముల
నిండి యున్నవి వేడి కన్నీటి బొట్లు
ఆయమ విశాల వక్షస్థలాంతరమున
కొట్టుకొనుచుండె దడదడ గుండెకాయ.

దిక్కులంజూచె బిడ్డని దిక్కుచూచె
వెక్కి వెక్కి యేడ్చు నెడంద చిక్కపట్టి
చుక్కల వెలుంగులో దారి చూచుకొనుచు
మరలి చూడక ముందుకు మాతృదేవి

తప్పటడుగులు వేయుచు తరలుచుండె
చిందిపడె నామె మోమున చెమట బొట్లు
బాలకుని ముద్దులొల్కు పెదాలమీద
బోసి నవ్వుల పుల్కలు పూయునట్లు.

వచ్చిన విపత్తు కూర్చి రవ్వంతయేని
ఎరుగకుండ నవ్వులను చిందించుచున్న
చిఱుతడి అమాయికపు పరిస్థితికి తల్లి
కొడుకు మొగమును గుండెలో గ్రుక్కుకొనుచు

చేరుకొనె మెల్లగానొక్క భూరుహంబు
చెమటబొట్టులు తుడిచి పై చెంగుతోడ
పాపనోటికందిచ్చె పాల్బట్లు తల్లి
కన్న పసికూన కురుల చక్కగను చేసి
చుట్టు ప్రక్కల భీతితో చూచిచూచి
చెట్టుక్రింద నెవ్వరికి కన్పట్టకుండ
కూరుచున్నది మాతృదేవేరి యంత
వాలుగన్నుల వేడిబాష్పమ్ము లురల

పాల బుగ్గల మేలివరాలపాప!
తమ్మిరేకుల కనుల ముత్యాలపాప!
బోసి నవ్వుల రతనాల ముద్దుపాప!
మారు మాటడ లేని చిన్నారిపాప!

పుట్టి పుట్టని నాడె ఈ పుడమిలోన
చుట్టుకొన్నవి నిన్ను ఇక్కట్టులిట్లు
చేయి కాల్ రాని తండ్రి! నీచేసి నట్టి
చెడుగు చెయ్యులవేమి! ఈ శిక్షలేమి!!

ఇట్టి పాపిష్ఠిదాని కివేల తండ్రి
పుట్టి కష్టాలలో గడ్డుకట్టినావు
దయయనన్నఱుంగని కిరాతకులు వెంట
వచ్చుచున్నారు నాన్న! నిన్ పట్టగాను!

కాళికాదేవి పాదాల మ్రోలవారు
గండ్రగొడ్డంట నిన్వేయ కడగినారు
ఎట్టులున్నచో నట్లగు నీశ్వరేచ్ఛ
అనుచువాపోయె తల్లియుల్లంబునందు.

ఎచట నుండియొకాని గ్రహింపలేము
వచ్చె గాలిదూయుచునొక్క వాడియమ్ము
అమ్మ హృదయమ్ము భయముతోనా
వటింప
లేచి నిలచెను పసివాని దాచుకొనుచు
ఒడలుకంపించి పోయెను - తడబడంగ
సాగెనడుగులు - ముందుకు సాగకుండె
కాళ్లు - కనుల కంతయు నంధకారమయ్యె
చేయునది లేక ఆమె నిశ్చేష్టయయ్యె.
రివ్వుమని వచ్చె బాణాలు రెండు మరల
కెవ్వుమని చేతి పసికూన కేకవేసె
నాయనా! అంచు తల్లి చిన్నారి బిడ్డ
నెడద కౌగలించుచు తాను పుడమినొరిగె.

# క్షా దొరికింది

శ్రీ జి. వి. రామమూర్తి



శీతాకాలం; అమావాశ్యరాత్రి. నా భార్య పుట్టింటికి వెళ్లడంవల్ల ఎన్ని గంటలకు యిల్లుచేరుకున్నా ఫరవాలేదని రాత్రి పన్నెండు గంటలవరకు నా స్నేహితుడింట్లో బతాకానీకొడుతూ కూర్చున్నాను.

"ఇంత రాత్రప్పుడు ఎందుకంత దూరం వెళ్లడం? నీ భార్య ఊర్లో లేదాయె! ఒంటరిగా అక్కడేం పడుకుంటావు - ఇక్కడే పడుకో - ఏర్పాటుచేస్తా" నని నా స్నేహితుడు అన్నాడు, గాని యింట్లో ఎవరూలేరు గనుక నే తప్పకుండా యిల్లుచేరుకోవాలని చెప్పి, మైలాపూర్ నుండి గాంధీనగర్ లో కొత్తగా కట్టించిన మా యింటికి సైకిల్ రిక్షాలో బయలుదేరాను.

పట్నం అప్పుడే మాటుమడిగింది. అక్కడా అక్కడా ఉన్న బంకు, టీ షాపుల దగ్గర మాత్రం కొద్దిగా సందడి ఉంది. మందవల్లి దాటిన తర్వాత ఊరు విడచి యింకో ఊరు వెళుతున్నట్లనిపించింది. శీతగాలికి కొంచెం చలివేస్తూంది. అందువల్ల రిక్షావాడు సినిమా పాటలను కూనిరాగాలు తీయసాగాడు. నా బుర్రలో ఆలోచనలు బయులుదేరాయి. "ఇంతా ఇంటికి వెళ్తే పరుపైనా సిద్ధంగా వేసివుండదే - గాంధీనగర్ కు చివరఉన్న అంత పెద్ద యింట్లో ఒంటరిగా పడుకోవాలి! పంపించక, పంపించక యీ రోజుల్లో ఎందుకు పంపించానా మా ఆవిడ్ని! ఈ చలిలో - యీ అర్ధరాత్రిపూట - ఎందుకీ ప్రయాణం! మైలాపూర్ లో వాడింట్లో పడుకుంటే తీరిపోయేది ... ... అక్కడ మా యింట్లో ఉన్న స్వేచ్ఛ ఎలాగుంటుంది? నా యింట్లో నా యిష్టంవచ్చినంతసేపు హాయిగా ముసుగుతన్ని పడుకోవచ్చు ... ..." అని యిలా ఆలోచించుకుంటూ ఉండగానే నా యింటి సమీపంలో రిక్షా ఆగింది. కొత్తగా కొళాయిలు వేస్తూ ఉండడంవల్ల, రోడ్డుకు అడ్డంగా కర్రలుకట్టి ఎర్ర దీపాలు వాటిమీద వెలుగుతున్నాయి. అందువల్ల అక్కడే రిక్షాదిగి, రిక్షావాడికి డబ్బుయిచ్చి మెల్లగా యిల్లుచేరుకున్నాను. వీధి తలుపు తాళం తీస్తూండగా, "ఎవరది?" అంటూ నన్నెవరో ప్రశ్నించారు. "ఏం?" అని నేను ఎదురుప్రశ్న వేసి, తలుపు తీసుకుని యింట్లోకిపోయాను. కార్పొరేషన్ వాచ్ మేన్ ఒకడు మా యింటి ప్రక్కనే ఒక గుడిసె వేసుకొని అందులోనే ఉంటూ, ఆ చుట్టు ప్రక్కల కాపలా కాస్తూ ఉంటాడని నాకు తెలుసు. వాడే నన్ను హెచ్చరించి ఉంటాడని అనుకుంటూ ఆ ఎదురుప్రశ్న వేసి సమాధానంకోసం ఎదురుచూడకుండా యింట్లోకిపోయి తలుపు వేసుకున్నాను.

చీకట్లో స్విచ్ వేసి, త్రోవచూసుకుని, దీపం ఆర్పి నా పడకగది చేరుకున్నాను. స్విచ్ నొక్కాను, దీపం వెలిగింది. నాకు భయం కలిగింది. నా టేబిల్ డ్రాయరు తెరచివుంది, బీరువా తీసిఉంది. గదినిండా కాగితాలూ, బట్టలు చిందర వందరగా పడిఉన్నాయి. ముందుగా నా బీరువా వెతకనారంభించాను. పుట్టింటినుండి తిరిగివచ్చేసరికి బహుమతిగా యిద్దామని నేనుకొన్న నెక్ లెస్ కనబడలేదు. కంగారుపడ్డాను. భయంవేసింది. ఏంచెయ్యడానికీ తోచలేదు. వణుకు పుట్టుకొచ్చింది "దొంగలు! దొంగలు!" అని పైకి గట్టిగా అరుద్దామనుకున్నాను. నోరు పెగల్లేదు. కొంచెం ధైర్యం తెచ్చుకుని, శక్తిని కూడగట్టుకోవాలనుకుంటూ ఉండగా నామీద ముసుగుపడింది. మరి నా నోట మాటరాలేదు. ఎవరో బలవంతంగా నా చేతినున్న రిస్టువాచీ, ఉంగరం తీసికుని పరిగెత్తిపోయారు.

అడుగుల చప్పుడు క్రమేపి సన్నగిల్లింది. నాకు కొంచెం భయంతగ్గింది. ధైర్యంచేసి "దొంగలు! దొంగలు!" అని అరుస్తూ వీధి తలుపుతీసి బయటకు వచ్చాను. పైకి బిగ్గరగా అరచానో లేక నా లోనే

అన్నానో నాకు తెలీదు. అప్పుడే ఆ సమీపానికి డ్యూటీమీద వచ్చిన ఒక పోలీస్ మేన్, నేను వీధి తలుపుతాళం తీస్తూండగా హెచ్చరించిన వాచ్ మేన్ నా దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చారు. కనుక నేను బిగ్గరగానే అరచేనని తెలుసుకున్నాను. విషయ మంతా తెలుసుకొని వాళ్ళిద్దరు యిల్లంతా పరిశోధించారు. ఎవరూ కనబడలేదు. నా వాఙ్మూలం తీసుకుని, "యిప్పుడే ఇన్‌స్పెక్టర్ని తీసుకువస్తా నంటూ పోలీస్ మేన్ వెళ్ళిపోయాడు.

నాకు ఇంట్లోకి వెళ్ళడానికి భయంవేసింది. పోలీస్ మన్ వెళ్ళినవైపే చూస్తూ, ఆలోచిస్తూ నిల్చున్నాను. ఆ రెండోవ్యక్తి అక్కడనుంచి వెళ్ళాలని రెండడుగులువేశాడు. "నువ్వు వెళ్తే ఎలాగ? నాకు భయంగా ఉంది. కాస్సేపు ఉండు" అని దీనంగా అన్నాను.

"బాబూ! వీధితలుపు తాళంవేసి రండి. పోలీసు వాళ్ళు వచ్చేవరకు నా గుడిసెలో బల్లమీద కూర్చోండి." అని నాకు ధైర్యంచెబుతూ నన్ను తన గుడిసెకు ఆహ్వానించాడు. చేసేదేమీలేక "అలాగే" నంటూ వీధితలుపు తాళంవేసి వాడితో కూడ వెళ్ళాను.

"మీరు యిలా యీ బల్లమీద కూర్చోండి" అని లోపలనున్న బల్ల చూపించి మర్యాదచేశాడు.

"నువ్వూ కూర్చో" అన్నాను.

"బాబుగారు చాలా భయపడుతూన్నారు. భయ పడకండి. కాస్సేపు విశ్రాంతి తీసుకోండి, నడుం వాల్చి" అని ధైర్యం చెప్పాడు.

"మరి నువ్వు?" అన్నాను.

"నా కెప్పుడూ రాత్రి డ్యూటియే కనుక నిద్దర రాదు" అంటూ మూలనున్న బస్తామీద కూర్చున్నాడు.

"నేను రాకముందు మా యింట్లో సందడేమీ నీకు వినబడలేదా?" అని అడిగాను.

"ఏదో సందడి జరిగిందండి: మీరే లోప లున్నారనుకున్నాను. అందుకనే మీరు తలుపు తీస్తున్నప్పుడు ఎవరదని అడిగాను."

"మరి నాతో వెంటనే చెప్పలేదేం?"

"ఏమిటోనండి యీ పాడు బుర్రకి ఆ మాత్రం చెడ్డ ఆలోచన తట్టలేదండి. ... ఛ! వెధవదీపం ఆరిపోయింది, వెలిగించివస్తా. పోలీసువాళ్ళొస్తారు మీకేం భయంలేదు, యిప్పుడే దీపం వెలిగించితెస్తా" అంటూ వెళ్ళిపోయాడు.

మెల్లిగా నడుంవాల్చి నా కాళ్లు బస్తామీదకు చాచాను. ఆ బస్తాలో ఏదో కదలినట్టయింది. నాకు భయంవేసింది "వాచ్ మన్! దొంగ! దొంగ!" అని గట్టిగా అరుస్తూ గుడిసెలోనుండి బయటకు వచ్చాను. అప్పుడే వస్తూన్న పోలీస్ యిన్‌స్పెక్టర్, పోలీస్ మేన్ నా దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చారు. "ఎక్కడ? ఎక్కడ?" అని నన్ను అడిగారు. వణుకుతున్న చెయ్యెత్తి మూలనున్న బస్తా చూపించాను.

"మీ అనుమానంకొద్దీ అలా అనుకుని ఉంటారు. ఆ మూల దొంగ ఎలా ఉంటాడు?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అనుమానంకాదు, నిజంగానే ఉన్నాడు ఆ బస్తాలో చూడం"డన్నాను, వణుకుతున్న కంఠంతో.

నవ్వుతూ ఇన్‌స్పెక్టర్ బస్తా కదిపాడు. అందులో నుంచి మూలుగు వినబడింది

"ఇందులో ఎవడో వున్నాడోయ్! బస్తా విప్పు! అంటూ పోలీస్‌మన్‌ను ఆజ్ఞాపించాడు ఇన్‌స్పెక్టరు. ఆజ్ఞానుసారం బస్తామూతి విప్పాడు పోలీస్ మేన్. సగంపోయిన ప్రాణాలతో, నెత్తురు కారుతున్న గాయాలతో బస్తాలోనుంచి బయటపడ్డా డొకడు.

"ఎవరు నువ్వు?" అని అధికార స్వరంతో ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"నేనా ... నేనా ... వా ... చ్ ... మా ... న ... డి" అంటూ నేలకు ఒరిగిపోయాడా నూతన వ్యక్తి.

"ఇందాక కన్పించిన వాచ్ మేన్ ఏడండీ?" అంటూ నన్నడిగేడు పోలీస్ మేన్.

"మీరు వచ్చేముందే ఆరిపోయిన దీపం వెలిగించడానికి వెళ్ళాడండి" అన్నాను నేను.

తెల్లమొహంవేసి ఇన్‌స్పెక్టర్ని చూశాడు పోలీస్ మేన్. వాళ్ళిద్దర్నీ చూసి నేను తెల్లమొహంవేశాను. "లైట్ వెలిగించడానికి వెళ్ళిన వాచ్ మేన్‌ను ఎలాగైనా పట్టుకోవాలన్నారు, మెల్లిగా వాళ్ళిద్దరు "క్లూ" దొరికిందన్నట్టు.

# దేవుని పోహసం చేయలేము

మూలం :

స్వామి శివానందజీ

అనువాదం :

శ్రీ నాయుడు వెంకటసీతారామమూర్తి B. Sc.

రామకృష్ణపరమహంస మెట్రిక్ చదువుతున్న రోజులు. క్లాసులో బాగా చురుకుగాఉంటూ లెక్కలు పేపరులో ఎక్కువ మార్కులు సంపాదించుకునే వాడు. ఇంగ్లీషులో రామకృష్ణుడు చాలా వెనుకబడిఉండేవాడు. ప్యాసు మార్కులు రాకపోగా సున్నలుకూడా వచ్చేవి. అందువల్ల లెక్కలును విడిచిపెట్టి ఇంగ్లీషు చదువుకే ఎక్కువకాలం వినియోగించేవాడు.

మెట్రిక్ పరీక్షలు సమీపించేయి. మొదటి రోజున లెక్కల పరీక్ష. మరుసటి రోజున ఇంగ్లీషు పరీక్ష. మొదటి రోజు లెక్కలు పేపరు బాగానే ఆన్సరుచేశాడు. మరునాటి ఇంగ్లీషు పేపరు గుర్తుకు వచ్చేటప్పటికి గుండెగుభేల్ మంది రామకృష్ణుడికి.

ఆ స్కూలు సమీపంలోనే ఒకచిన్న దేవాలయంఉండేది. మానవుడికి సాధ్యం కాని ఏపనైనా భగవంతుడు చేయగలడని రామకృష్ణుని నమ్మకం. అందువల్ల ఆలయంలోనికివెళ్లి "భగవంతుడా! నన్ను రక్షించు. ఇంగ్లీషు పేపరులో నాకు మంచి మార్కులువస్తే ఇరవైరూపాయలు ఖర్చుచేసి అన్నిరకాల ఫలాలుకొని నీకు అత్యంత వైభవంగా పూజచేయిస్తాను" అని మొక్కుకున్నాడు.

మరునాడు పరీక్షహాలులోనికి వెళ్లి ఇంగ్లీషు పేపరు చూశేసరికి చాలాసులువుగా ఉన్నట్టు కన్పించింది. రామకృష్ణుడు బ్రహ్మానంద భరితుడయ్యేడు. పేపరు పూర్తిగా ఆన్సరుచేశాడు. ఇంకా కొంత టైము మిగిలిపోయింది. "ఈ లోగా దేవుడికి ఖర్చుపెట్టవలసిన యిరవై రూపాయలు ఏవిధంగా ఖర్చుపెట్టాలి?" అని ఆలోచిస్తూకూర్చున్నాడు.

దేవుని దయవల్ల తాను ఇంగ్లీషు పేపరు సులువుగా ఆన్సరు చేయగలిగేడు. తన మొక్కుప్రకారం ఖర్చుపెట్టవలసిన యిరవైరూపాయలకూ ఒక పెద్ద లిష్టు తయారుచేశాడు. తరువాత మళ్లీ ఆలోచించాడు "యిన్నిరకాలవస్తువులు అనవసరం – యింతడబ్బు వెచ్చించడం శుద్ధ దండుగగా" అనుకొని కొన్నిటిని తగ్గించి వేశాడు. సొమ్ము 15 రూపాయలు అయింది. రామకృష్ణుడు మళ్లీ ఆలోచించేడు "ఈ వస్తువులన్ని వాళ్లూ వీళ్లూ తినడం తప్ప దేవుడు వచ్చితినడుగదా!" అనుకొని కాగితంమీద వ్రాసిన లిష్టునుకొట్టేశి మళ్లీ కొత్త లిష్టును తయారుచేశాడు. మొత్తం ఖర్చు పది రూపాయలకు దిగజారింది.

"నాకు పరీక్షలో సహాయం చేసినంత మాత్రాన దేవుడికి పదిరూపాయలు లంచం యివ్వాలా?" అని మళ్లీ ఆలోచించుకున్నాడు. "ఒక కాయగాని, ఒక పండుగానీ, ఒక ఆకుగానీ భక్తితో సమర్పిస్తే భగవంతుడు తప్పక స్వీకరిస్తాడని తాను ఒకప్పుడు భగవద్గీతలో చదివేడు. యిప్పుడు యింతడబ్బు తగలేయడం అనవసరం" అనుకున్నాడు. లిష్టు రెండు రూపాయలకు తయారయింది.

"ఆ రెండురూపాయలుకూడా మిగుల్చుకోవాలని బుద్ధిపుట్టింది రామకృష్ణుడికి. తనదొడ్లో కాచిన అరటిగెలను సమర్పిస్తే" చాలనుకున్నాడు. పరీక్షహాలులో కాగితాలమీద వ్రాసిన ఈ కొట్టివేతల లిష్టంతా అయిదారు పేజీలు తయారయింది.

ఇంతలో బెల్లు మ్రోగింది. మాష్టారు కుర్రవాళ్ల వద్దనుంచి పేపర్లు లాగేసుకుంటున్నారు. రామకృష్ణుడు తన పేపరు యిచ్చేసి ఎగిరి గంతేసుకుంటూ యింటికి చక్కావచ్చేడు.

"అదేమిట్రా! ఆన్సరుపేపరు యింటికి తీసుకువచ్చేవు?" అని తండ్రి ప్రశ్నించేసరికి రామకృష్ణుడు తనచేతిలో ఉన్న కాగితాల్ని చూసుకున్నాడు. అవి నిజంగా పరీక్ష కాగితాలే! ఎంతపనిజరిగింది! పరధ్యాన్నంగా ఉండి పూజచేయడానికి తయారు చేసిన లిష్టుకాగితాల్ని మాష్టారుకియిచ్చేసి పరీక్ష కాగితాల్ని యింటికి తీసుకువచ్చేడు. రామకృష్ణుడికి కళ్లుచెమ్మగిల్లేయి. తాను చేసిన పొరపాటును తెలుసుకున్నాడు. భగవంతుని కృపవల్ల పేపరు సులువుగానేఉంది. కాని ఆ దేవుణ్ణే మోసం చేయడానికి సంకల్పించేడు. యిరవైరూపాయలు ఖర్చు చేస్తానని మొక్కుకున్నాడు. తరువాత ఉత్త చేతులు చూపించడానికి నిర్ణయించుకున్నాడు. అందువల్ల తనకే మోసం జరిగింది. జరిగిన సంగతంతా తండ్రితో చెప్పేడు.

"నీవునన్ను మోసంచేయవచ్చు. మరెవరినయినా మోసంచేయవచ్చు. కానీ భగవంతుని మాత్రం మోసంచేయలేవు" అన్న తండ్రి మాటలు రామకృష్ణుని చెవిలో గింగురుమన్నాయి.

# ఉక్కు శక్తికి చిహ్నం

దేశాభివృద్ధికి ఉక్కు ముఖ్యావసరం. మూల, భారీపరిశ్రమలకూ, నిత్యజీవితావసర వస్తువులు తయారుచేసే యంత్రాలను ఉత్పత్తిచేసే యంత్రాలకు, ఉక్కు చాలా అవసరం. భిలాయ్, రూర్కెలా, దుర్గాపూరులలో స్థాపింపబడుతున్న ఉక్కు ఉత్పత్తి కర్మాగారాలు దేశావసరాలకు సరిపోయిన ఉక్కు సరఫరా చేస్తాయి.

ఎన్నో మిలియన్ టన్నుల బొగ్గు, ఎన్నో వాట్ల విద్యుచ్ఛక్తి పరిశ్రమలు నడవడానికి కీలకాలు.



## మూల శక్తి

ముడి సరుకులను అధికంగా అందించడానికి, తయారైన వస్తువులను బయటకు చేరవేయడానికి రవాణా సౌకర్యాలు విస్తరింపబడుతున్నాయి.

ఉక్కు, బొగ్గు, రైల్వేలు, రేవులు, విద్యుత్తు మొదలైన ఈ అభివృద్ధి కార్యక్రమాలు ఆర్థిక వికాసానికి మూలకందాలు కనుకనే, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక వీటి అభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని రూపొందింపబడింది



## ప్రణాళిక పురోగతి

సంపదలకూ, సర్వతోముఖాభివృద్ధికి—

DA-57/296

(120-వ పేజీ తరువాయి)

తరచుగా చేయుమన్న పనులను చేయ నిరాకరించెడి సంగతిని జ్ఞప్తికి దెచ్చుకొనుట ముఖ్యము అదియును గాక మనము, తరచుగా బిడ్డ పరిస్థితిని పరీక్షింపక అనాలోచితముగ ఏదో చేయుమనుటయు కద్దు.

5. పెద్దలు తమ అసంతుష్టిని, అయిష్టతను జూపుటయే కొందరు పిల్లలకు తగిన శిక్షణ యగును. కాని ఈ యసంతుష్టిని, అయిష్టతను జూపుట బిడ్డయెడల గాక బిడ్డ చేసిన కార్యముపట్ల కావలెను. అల్లరి జేయుచున్న తన చిన్నబిడ్డతో తల్లి "నీవన్న నాకు అసహ్యము, నీపై నాకు ప్రేమ సున్న" యని ఈసడించి పలికెను. దానికి ఆబిడ్డ ఎంతో నొచ్చుకొని బాధపడెను. "నీపై నాకు ప్రేమ లేదని" పిల్లలతో ఎన్నడు పలుకరాదు. అట్లనుట తప్పు. అట్లనినచో వారికిగల భద్రతా భావము నశించును. తానెంత తప్పొనరించినను తనతల్లిదండ్రుల ప్రేమను మాత్రము కోల్పోనని యెడి ధైర్య మతనికి ఉండవలెను.

6. కొట్టుట, గుంజీలు తీయించుట వంటి దైహిక దండనలు, బిడ్డ నెట్లు శిక్షణయందుంచుటయు తెలియక చేసెడి పనులే యగును. అట్టి దండనల నిచ్చుటయే పనికిరాదు. ఇచ్చినను ఎప్పుడో అరుదుగా నిచ్చుట కావలెను. దైహిక దండనలు బిడ్డకు భయమును గొలుపును. తానేదో నేరస్థుడ ననెడి భావమును కల్పించును. అట్టి భావము గలిగి నపుడు బిడ్డ తలిదండ్రులతోగాని ఇతరులతోగాని సరియగు సంబంధములను గలిగి సంతోషముగా మసలు కొనజాలడు.

## కఠినముగను, తరచుగను, దండించుటచే కలిగెడి చెడు ఫలితములు.

1. అతి తరచుగాగాని, అన్యాయముగాగాని, దండించుచుండుటచే బిడ్డకు భయము కలుగును. ఆ భయము బిడ్డ స్వభావమునుబట్టి వివిధ రీతుల వ్యక్తమగుచుండును. భయమువలన అబద్ధమాడుటయు, మోసగించుటయు అలవడును. ఈ గుణములు మామూలు బిడ్డలందును, నేరము చేసెడి బిడ్డలందును గూడ ఎన్నో విధముల నగుపడుచుండును. కొందరు బిడ్డలు కఠిన దండనలచే నత్యంతమగు భీతి నొందుదురు. ఎవరైనను తమతో తొందరగా మాట్లాడినను తమకడకు తటాలున కదలివచ్చినను కొట్టుటకేయన్నట్లు వణకుచు, వెనుకకు తగ్గుచు, దయకు ప్రాధేయపడు రీతిగ నీచముగా ప్రవర్తింతురు.

2. కొందరు పిల్లలు కాఠిన్యతను, క్రూరత్వమును జూపెడి జగడగాండ్రుగా తయారగుదురు. చాలా మంది ఎదురించెడి స్వభావమును, అన్నిటిని పాడు జేసెడి స్వభావమును జూపుచుందురు.

3. సున్నిత స్వభావులైన పిల్లలును, తమ వ్యక్తిత్వము నేమాత్రమును జూపని పిల్లలును పిరికివారుగనో బిడియపడువారుగనో తయారగుదురు. అట్లు తయారైనవారు పగటికలలను గనుచు, ఊహా ప్రపంచమున చరించుచు శాంతంగా నుండుటకు ప్రయత్నింప గలరు. మరి కొందరు బిడ్డలు అర్థములేని భయములను పొందుచుందురు. చాలామంది పిల్లలు తమ "భద్రతలేమి" భావమును కప్పిపుచ్చుటకై అట్టహాసముగ ప్రవర్తించుచుందురు.

4. సరిగా నిద్రింపకుండుట, భయంకరమగు కలలను గనుట శరీరములో నిక్కడనక్కడ పీకు కొన్నట్లును, గుంజుకొన్నట్లును బాధపడుట, గోళ్లను కొరుకుచుండుట ఇత్యాది నాడీ సంబంధములగు అవలక్షణములను జూపుచుందురు.

(సశేషము)

—(౦)—




# మంత్రి పన్నిన ఉపాయం

శ్రీ పి. ప్రభూదాస్

తిరుచునాపల్లి కావేరినది ఒడ్డున వున్నది. చాలా కాలం క్రిందట ఆ ప్రదేశాన్ని ఓ రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఒక రోజున ఆ రాజు తన మంత్రితో కలసి నదీ తీరాన షికారు చేస్తున్నాడు. కావేరినది పడమటినుండి తూర్పు తీరానికి పారుచున్నది. రాజు నదీజలాలు ఉవ్వెత్తుగా తూర్పునకు ప్రవహించడం చూచాడు. తన మంత్రిని పిలచి అడిగాడు. "మంత్రీ! తూర్పుదిశలో ఏదేశమున్నది." "ఇక్కడకు తూర్పుగా తంజావూరుజిల్లా ఉన్నద"ని మంత్రి సవినయముగా జవాబిచ్చాడు. దానిపై తిరిగి రాజు ఇలా అన్నాడు. "మన నదీ జలాలవలన తంజావూరి ప్రజలు సుఖిస్తున్నారు. కనుక యిదేమీ నాకు బాగా లేదు. మన నదివలన మనమే సౌఖ్యంగా ఉండాలి. ఇతరులు అనుభవించడం నాకు సుతరాము ఇష్టంలేదు. అంచేత వెంటనే నదికి అనకట్టకట్టి ప్రవాహాన్ని అరికట్టాలి. ఇది నా ఆజ్ఞ."

మంత్రికి రాజు మంకుపట్టు ఇదివరకే తెలుసు అతను పట్టిన కుందేటికి మూడేకాళ్లంటాడు. మరియు వారితో తర్కవితర్కాలు చేసినా ప్రయోజనం శూన్యం. అంచేత మంత్రి సవినయంగా అంగీకరించి— "చిత్తం మహాప్రభో తమ ఆజ్ఞ పాలిస్తా"నన్నాడు.

మరునాడే అనకట్ట కట్టబడింది. కావేరి పవాహం నిలచిపోయింది. కాని అంతటితో అవుతుందా! నది పూర్ణగర్భిణిలా పొంగి నీటితో నిండిపోయింది. విస్తరించడానికి తావులేక గట్టుపై కుబికి ప్రవహించి పట్టణవీధుల్లోకి పరిగెత్తాయి. సాయంత్రమయ్యేసరికి పట్టణమంతా జలమయమైంది. వీధుల్లో నీళ్ళు, ఇండ్లల్లో నీళ్ళు — వరండాలో నీళ్ళు — వంటింట్లో నీళ్లు — అంతా జలమయం. పొడినేల ఎక్కడా కన్పించడమే లేదు. దీనికంతటికి కారణం రాజుగారి మూర్ఖత్వమని ప్రజలందరికి తెలిసిపోయింది. కాని ఎవరేం చేస్తారు. వారి దగ్గరకుపోయి తమరు చేసిన పని చాలా అవివేకమైనదని చెప్పగల ధైర్యస్థైర్యాలెవరికున్నాయి? చేసేదిలేక అంతా మంత్రిగారితో చాటుగా మొఱపెట్టుకున్నారు. పాపం మంత్రి మాత్రం ఏమి చేయగలడు! వారి కష్టాలన్నీ మంత్రికి తెలిసినవే. అంచేత ఆయన చేసేదిలేక చింతాక్రాంతుడయ్యాడు. చిట్టచివరకు మంత్రిగారి మెదడులో ఏదో ఉపాయం ఒకటి తళుక్కున మెరసింది — "సరే - ఇక మీరు మీ నివాసాలకుపొండి, దీనికి ఏదో ఉపాయం చేస్తాను" అని ప్రజలకు నచ్చ చెప్పాడు.

ఆ కాలంలో ఇప్పటిలా గడియారాలు లేవు. రాజమహలు ఎదుట ఒక కంచుగంట కట్టబడియున్నది. ఒక సిపాయి ఎల్లప్పుడు ఒక్కొక్క గంటకు (60॥ ని॥లకు) ఒక్కొక్క ఘంట వాయించ

కొడతాడు. దీనిని బట్టి ప్రజలు కాలకృత్యాలు నెరవేర్చుకుంటారు. మంత్రి ఆ రాత్రి గంట మ్రోగించే సిపాయిని పిలిపించాడు. "నేటి రాత్రి గంటలు త్వరత్వరగా వాయించాలి. గంట అయిందా లేదా అన్న నిమిత్తముతో పనిలేదు. తెలిసిందా!"

"చిత్తం ప్రభో! తమరి ఆజ్ఞానుసారమే అనుసరిస్తా"నంటూ సిపాయి తన పనిలో నిమగ్నుడయ్యాడు.

సిపాయి - అరగంటకు ఒక ఘంట వాయించడం మొదలుపెట్టాడు. పది - పన్నెండు - తిరిగి, ఒకటి - రెండు - మూడు - నాలుగు - ఐదు - చివరకు ఆరవ గంట కొట్టబడింది. ఆరవ గంట వినిపించగానే ప్రాతఃకాలమయిందనుకొని జనమంతా మేలుకున్నారు. రాజు కూడా కళ్లు తెరచి చూచాడు. కాని ఇదేమిటి! ఆరు గంటలయినప్పటికీ సూర్యుడి జాడ కనిపించదే! నలువైపులా చిమ్మ చీకట్లు క్రమ్మాయి.

రాజు వెంటనే మంత్రికి కబురు పంపించాడు. మంత్రి వచ్చాడు. "ఏంమంత్రీ! ఆరుగంటలయింది. కాని సూర్యుడు ఇంతవరకూ ఉదయించనేలేదేం? ఏమిటి విశేషం?" రాజు మంత్రిని అడిగాడు.

మంత్రి చేతులు జోడించి అన్నాడు "అయ్యా! చూడగా తంజావూరివాళ్ళు ఏదో కొంతమోసం చేసినట్లుగా తోస్తున్నది. సూర్యుడు ఎల్లప్పుడూ తూర్పు నుండి ఉదయిస్తాడు. మనమేమో తంజావూరు వారికి ప్రవహించే జలాలను అరికట్టాము కదా! బహుశా ఆ పగ తీర్చుకోడానికి వారు తమవైపునుండి వస్తూన్న సూర్య భగవానుని పట్టి బంధించి యుంటారు. తమరి సెలవైతే తక్షణమే ఆనకట్ట పగులగొట్టించివేస్తాను. వాళ్ళకూ మనకూ పేచీ ఉండదు" అన్నాడు మంత్రి.

అప్పుడు రాజన్నాడు "ఓహో! అదా సంగతి ఐతే ఈ క్షణమే ఆనకట్ట భగ్నం చేయించు"

ఆనకట్ట ఛేదిస్తూండగా అరుణ కిరణాలు తూర్పు దిశ తోచాయి. మంత్రి రాజునుసమీపించి అన్నాడు "కట్ట కొట్టివేయబడింది. నీళ్ళు తంజావూరు ప్రవహించడం చూడగానే వారు సూర్యున్ని విడిచిపెట్టారు. అడుగో భానుడు తూర్పుకొండ చరియల్లోంచి వస్తున్నాడు" అని చూపించాడు.

అప్పుడు రాజు తన అవివేకాన్ని తెలుసుకొని, తను ప్రజలకు, ఇతర సోదర దేశానికి చేసిన అపచారానికి విలపించాడు. మంత్రి బుద్ధిబలాన్ని మిక్కిలి ప్రశంసించాడు.

# దయాఫలితం

శ్రీ కూచిభొట్ల సూర్యనారాయణమూర్తి

సుబుక్తగీన్ చక్రవర్తి ప్రథమంలో కటిక దరిద్రుడు. అతడొక సాధారణ సైనికుడు. అతడొకనాడు తుపాకి తీసుకుని గుఱ్ఱంమీద కూర్చుని వేటకై అరణ్యానికిపోయాడు. ఆ రోజున అతడు అరణ్యంలో చాలా సేపు తిరగవలసి వచ్చింది. చాలా దూరంపోయిన మీదట అతడు ఓ లేడి తన పిల్లతో ఉండటం చూశాడు. అతడు గుఱ్ఱాన్ని దాని వెంట దౌడు తీయించాడు.

లేడి భయంతో పారిపోయి ఓ పొదలో దాక్కుంది. కాని దాని పిల్ల వెనకబడిపోయింది. అతడు ఆ లేడి పిల్ల కాళ్లు కట్టేసి గుఱ్ఱంమీద పడవేశాడు. చాలా వెదికినప్పటికీకూడా లేడిదొరక్క పోయేసరికి ఆ పిల్లనే తీసుకుని స్వగృహానికి పోసాగాడు.

తన పిల్లను అతడు కట్టేసి తీసుకు పోతూండటం లేడిచూసింది. అది తనపిల్ల మీాద ఉండే మమకారంకొద్దీ పొదలోనుండి బయటకువచ్చి సిపాయీ గుఱ్ఱంవెనుకనే పరుగెత్తి సాగింది. తనవెంట లేడి పరుగెత్తుకురావటం చూసేసరికి సుబుక్తగన్‌కు ఆశ్చర్యంవేయటమేగాక దయకూడా కలిగింది. అతను దానిపిల్లకాళ్లకుగట్టిన బంధములవిప్పేసి విడిచాడు. లేడి తన పిల్లతో ఆనందంగా పారిపోయింది.

ఆనాడు యింటికివచ్చేసరికే అతనికి నిద్రవచ్చేసింది. నిద్రలో కలవచ్చింది. ఆ కలలో దివ్యతేజస్సులతో ప్రకాశించు ఓ దేవదూత, సుబుక్తగీన్‌తో యిలా పల్కాడు-''సుబుక్తగీన్! నువ్వు ఓ లేడి మీాదచూపినదయకు పరమాత్మ ఆనందించి నీ పేరును చక్రవర్తుల జాబితాలో వ్రాయమని ఆజ్ఞాపించాడు. నువ్వు ఒకానొకనాడు దేశానికి చక్రవర్తివి అవుతావు.''

సుబుక్తగన్‌కు వచ్చిన కల నిజమయినది. అతడు కొద్దికాలంలోనే చక్రవర్తి అయ్యాడు. ఒక లేడిమీాదచూపిన దయకు అతడు పొందిన ఫలితమిదే. జీవులమీాద, దయ చూపించేవారిమీాద పరమేశ్వరుడు తప్పక దయచూపుతాడనే విషయాన్ని అతడు అందరకూ తెలియజేశాడు.






ఆంధ్ర మహిళ 14-వ వార్షిక సంచిక మా కార్యాలయమునకు చేరినది. వెల రు. 2-0-0.

ఇందులో వినోద విజ్ఞానములను సమకూర్చే వ్యాసములు, నాటికలు, ఖండకావ్యములు, మహిళా ప్రబోధము పొందుపరచబడినది. దీనితోబాటు యిందలి చిత్రములు సంచికను ఆకర్షణీయంగా నొప్పించినవి.

ఈ సంచికను వెలువడచేయడంలో ఆంధ్రమహిళాసభవారి కార్యదీక్ష, కృషియునేకాక యిది ఆంధ్ర మహిళాసభ అభివృద్ధి చిహ్నముగా నున్నది

కావలసినవారు ఆంధ్రమహిళాసభ, మైలాపూరు, మద్రాసుకువ్రాసి తెప్పించుకోవచ్చును.

**పాలపుంత : కొత్తపల్లి రంగారావుగారు. అరుణోదయ ప్రచురణలు, అమృతలూరు, గుంటూరుజిల్లా. వెల 25 నయాపైసాలు.**

ఇందులోని 50 పొడుపుకథలు పాఠకునికి యూహాపోహలకు అవకాశమిస్తూ విజ్ఞాన వినోదాలను కల్పిస్తున్నవి. ఈ పుస్తకం చదివినంతసేపు అభిరుచి ఉత్సాహాసక్తులను తొణికిసలాడ జేయుచున్నది.

**మహా పతివ్రతలు : పిల్లా సుబ్బారావుశాస్త్రిగారు. ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.**

సుమతి, సావిత్రి, అనసూయ, తులసీమహాదేవి, అరుంధతి, నళినీదేవి, లోపాముద్ర, ద్రౌపది పతివ్రతల జీవితచరిత్రలను యీ చిన్న పుస్తకముగా రూపొందించబడినది.

బాలల సాహిత్యరచనలో అనుభవశాలియైన గ్రంథకర్త యీ చిన్న పుస్తకం ద్వారా జాతీయతను, పాతివ్రత్యముయొక్క విశిష్టతను, పురాణయుగంనాటి నైతికస్థాయిని బాలబాలికలకు ప్రబోధించుటకు వినియోగపడగలదని ఆశిస్తున్నాము.

---

(167-వ పేజి తరువాయి)

అది తమపైన, ప్రాంతీయభాషలపైన ఆధిపత్యం అధికారము చలాయించ నుద్దేశించ నున్నదనే భయాందోళనలకు అవకాశ మేర్పడింది.

ప్రాంతీయ భాషలను, హిందీని మరింత ఆసక్తితో ప్రభుత్వము ప్రోత్సహించవచ్చు. కాని ఇంగ్లీషు వలన మనకు సమకూరిన వసతులను మెల్లను విస్మరించి, జాతీయ అంతర్జాతీయ రంగాలలో కష్టనష్టాలకు గురికావడం క్షేమకరం కాదు. అధికారభాషగా హిందీ కావలెనా, ఇంగ్లీషు నిలబడాలనా అనేది రానున్న తరాలవారికి విడిచిపెట్టుటవలన అనవసర అశాంతికి అవకాశము లేకుండా పోగలదు.

ఈనాడు ఇంగ్లీషువలన సాంస్కృతిక, రాజకీయ, సాంఘిక రంగాలలో జాతీయతకట్టి ముప్పను లేదు కాబట్టి ప్రాంతీయ, హిందీభాషల మహోజ్వల అభివృద్ధితో బాటు ఇంగ్లీషు జాతీయ అంతర్జాతీయ రంగాలలో వినియోగపడి దేశముయొక్క సమైక్యతకు, పరిపాలనా సౌలభ్యమునకు తోడ్పడడం వాంఛనీయము.

# సంపాదకీయములు

## నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య

దేశం మొత్తంపై నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్యను తృతీయ పంచవర్ష ప్రణాళిక కాలం పూర్తి యయ్యేలోగా అమలుపరచాలని ప్రాథమిక విద్యా సంఘం సిఫార్సు చేసింది. అంటే ఆరు మొదలు పదకొండు సంవత్సరముల వయస్సుగల పిల్లలందరికి ఉచిత ప్రాథమిక విద్యను నేర్పబడాలని సూచించబడింది.

ప్రజావసరాలలో నొకటగు విద్యావ్యాప్తి నుద్దేశించి యీ సూచన చేయబడటం సంతోషింపవలసిన విషయము దీనిని ప్రభుత్వము అమలుపరచడంతో బాటు విద్యా విజ్ఞానములను, సంగీత సాహిత్యములను, లలితకళలను జనసామాన్యమునకు మరింత అందుబాటులోనికి తీసికొనివచ్చుట వాంఛనీయము.

## అధికారభాషా సమస్య

ఇప్పుడు అధికారభాషగా నున్న ఇంగ్లీషు స్థానంలోకి హిందీని నిర్ణీతకాలంలో ప్రవేశపెట్టాలనే ప్రభుత్వ ప్రతిపాదన కొంత అలజడికి కారణమయింది.

కాని విదేశ పాలనక్రింద ఇంగ్లీషు భాషవలన దేశభాషలకు, జాతీయ సంస్కృతికి కొంత అపకారం జరిగినా ఇంగ్లీషు మనదేశం నాలుగు మూలలను సమైక్యపరచి పరిపాలనా సౌలభ్యాన్ని పెంపుచేసింది. ఇంగ్లీషు మన జాతీయభాష కాకపోయినా మనం అధికారభాషగా స్వీకరించి, అభ్యసించక తప్పలేదు. అలా కొన్ని వందల సంవత్సరములనుండి యీనాటివరకు అధికారభాషగా నుండి, అధిక సంఖ్యాకులు అభ్యసించి, అభ్యసిస్తూయున్న ఇంగ్లీషును విడిచిపుచ్చి, మరచిపోయి, హిందీ జాతీయభాష అయినా దాని నభ్యసింపచేసి, అధికారభాషగా నమలుపరచ ప్రయత్నించుట సులభసాధ్యము కాకపోవుటయే కాక కొన్ని ప్రాంతీయ భాషావాదులలో లేనిపోని అనుమాన సంకోచములను తెచ్చిపెట్టినది.

ఒకప్పుడు ఇంగ్లీషు భాష ఇంగ్లాండు సొత్తయినా యీనాడుమాత్రం ప్రపంచ భాషగా వ్యాప్తిచెంది వివిధ దేశాలమధ్య సాన్నిహిత్యాన్ని సంపాదించింది. ప్రపంచ దేశాలమధ్య పరస్పర సాంస్కృతిక, వాణిజ్య సంబంధముల అభివృద్ధికి ఇంగ్లీషు పట్టుకొమ్మ అయినదంటే అతిశయోక్తి కాదు.

ఈనాటి సమైక్య భారతవర్ష స్వరూపానికి ఇంగ్లీషుభాషచాలవరకు కారణముకాగా, దాని స్థానంలోకి హిందీ వచ్చి ప్రాంతీయ సమైక్యతను విచ్ఛిన్నము చేయనున్నచో నది వాంఛనీయము కాదు. పైగా పరిపాలనా సౌలభ్యమునకు ముప్పమురాని విధంగా సయితము అధికారభాషా నిర్ణయం జరగాలి.

హిందీని విశేషంగా హిందీభాషేతరులు సయితం అభ్యసిస్తున్నమాట వాస్తవమే. కాని అది ఐచ్ఛికంగా జరుగుతున్నది. అంతవరకు స్పర్థలకు, ద్వేషానికి తావు లేకుండినది. నిర్ణీతకాలంలో హిందీ అధికారభాష కావాలి అనేసరికి హిందీభాషేతరుల కది ఇంగ్లీషుకంటె కూడ క్రొత్తగా తోచడమే కాక

(166—వ పేజి చూడుడు)

## శ్రీ హేవళంబినామ సంII ఫాల్గుణ మాసము

| | | | |
|---|---|---|---|
| మార్చి నెల 1958 సంII | 16 | ఆ | ఏ 6 5 శ్ర 51.20 |
| | 17 | సో | ద్వా 8-31 ధ 55-49 త్యా 4-18 |
| | 18 | మం | త్ర 11.51 శత 60.10 మాసశివరాత్రి |
| | 19 | బు | చతు 15.53 శత 1.13 అమావాస్యతిధిః |
| | 20 | గు | ● అమా 20-25 పూభా 7.0 శూన్యతిథి |
| | | | **శ్రీ విళంబినామ సంII చైత్రమాసము** |
| | 21 | శు | శుపా 25-5 ఉభా 12.56 ఉగాది |
| | 22 | శ | వి 30.2 రే 19-12 |
| | 23 | ఆ | త 34.21 అశ్వ 24.5 మత్స్యజయంతి, సౌభాగ్య గౌరీవ్రతం |
| | 24 | సో | చ 38.2 భర 30-20 |
| | 25 | మం | పం 40.51 కృ 34.23 శ్రీపంచమి |
| | 26 | బు | ష 42.30 రో 37.45 శ్రీ రంగం ఆదిబ్రహ్మోత్సవారంభం |
| | 27 | గు | స 44.3 మృ 39-53 |
| | 28 | శు | అ 42.30 ఆర్ద్రా 40-58 అశోకాష్టమి |
| | 29 | శ | న 40-33 పున 40.45 శ్రీరామనవమి |
| | 30 | ఆ | ద 37.31 పుష్య 39-28 ధర్మరాజ దశమి |
| | 31 | సో | ఏ 31-50 ఆశ్లే 36.30 |
| ఏప్రిల్ నెల 1958 సంII | 1 | మం | ద్వా 27.58 మఖ 33.27 |
| | 2 | బు | త్ర 22-9 పూఫ 29.25 |
| | 3 | గు | చతు 15.53 ఉఫ 24.57 |
| | 4 | శు | ○ పౌ 9.24 హస్త 20-24 |
| | 5 | శ | కృపా 3.2 విది 53-56 చిత్త 15.58 |
| | 6 | ఆ | తది 50-20 స్వా 11.57 |
| | 7 | సో | చ 46.42 విశా 8-34 |
| | 8 | మం | పం 40.5 అనూ 26.4 |
| | 9 | బు | ష 40.41 జ్యే 4-40 |
| | 10 | గు | స 39-28 మూల 4.22 |
| | 11 | శు | అ 39-28 పూషా 5.19 |
| | 12 | శ | న 40.41 ఉషా 7-29 |
| | 13 | ఆ | ద 43.0 శ్ర 10.46 శ్రీరంగం గరుడోత్సవం |
| | 14 | సో | ఏ 46.15 ధని 15.5 |
| | 15 | మం | ద్వా 50-13 శత 20-10 శ్రీ పెరుంబూదూరు ఉడయవర్ల ఉత్సవారంభం |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.